# శబరి

( పద్యకావ్యము )



రచయిత్రి:

రాష్ట్రభాషాప్రవీణ

భోగరాజు చిట్టెమ్మ.

పూళ్ళ, పశ్చిమగోదావరిజిల్లా.



[వెల 1-0-0

# విషయానుక్రమణిక



# పీ ఠి క



"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్"

అనునట్లు దురవగాహమగు వేదము కలికాలమునందలి యల్ప మేధస్కులకుఁ దెలియ నసాధ్యమని, యందలి విషయముల నితిహాసపురాణమార్గమున మనకుఁ బ్రసాదించిన మహర్షులలో ముఖ్యుఁడగు వాల్మీకి రచించిన యితిహాసరూపకమగు శ్రీమద్రామాయణ మహాకావ్యమునందలి యరణ్యకాండము నందు 74వ సర్గమునందీ శబరి చరిత్రము సంగ్రహముగ వర్ణింపఁబడినది.

"యాన్యనవద్యానికర్మాణి, తానిత్వయోపసేవ్యాని, నోయితరాణి" ఇత్యాదికములగు వేదానుశాసనములకుఁ గుఱియైన, శ్రీరాముని దివ్యచరిత్రరత్నాకరమున నీ శబరిచరిత్ర మొక మేలిరత్నమై ప్రకాశించుచున్నది.

"కేవలకల్పనాకథలు కృత్రిమ రత్నములు"గాని యీ చరిత్రముమాత్రము జాతిరత్నమే యనఁదగును. భక్తులు కొందరు తమ భక్త్యనుసారముగా దీనిలో కొన్ని మనోహరమైన కల్పనలుచేసినట్లు తోఁచుచున్నది. వాల్మీకిరచిత రామాయణములో శబరి "మయాతు వివిధంవన్యం సఞ్చితంపురుషర్షభ! తవార్థేపురుషవ్యాఘ్ర! పంపాయాస్తీరసంభవమ్"

వా. రా. 74 స 17 శ్లో.

(ఓ పురుషోత్తమా! పంపాసర స్తీరమునందుఁబుట్టు నానావిధములగు వన్యపదార్థములను నీకొఱకు సేకరించి

యుంచితిని.) అని యున్నట్లుమాత్రమే వ్రాయబడియున్నది. అచ్చటనే 7 వ శ్లోకములో "పాద్యమాచమ నీయంచ సర్వం ప్రాదాద్యథావిధి" అనిఅర్ఘ్యపాద్యాచమనీయముల నొసంగినట్లున్నది. అందలి సర్వంఅను విశేషణసారస్యమునుబట్టి యీ ఫలాతిథ్యమునుగూడ శబరి రామునకీయఁగా నతఁడు గైకొనెనని యర్థము చేసికొనవలెనుగదా ? ఇఁక పండ్లతోఁగొరికి తియ్యనిపండ్లనేర్చి శబరి రామునకిచ్చినదను సంప్రదాయపుకథ భక్తుల భక్తితత్పరతను, భగవంతుని భక్తవాత్సల్యమును ప్రకటించు నాఖ్యాయికగా నుండనోపు.

ఇఁక నీకవయిత్రి యీ కథను భక్తలోకరంజనార్థము కొన్ని మార్పులతోఁ బెంచి వ్రాసియున్నది. ముఖ్యముగా నీ రామాయణకథారచనములోఁ జాలమందికవులు తమ భక్తి తత్పరత్వమున నీమార్గము ననుసరించియేయున్నారు. "శతకోటి ప్రవిస్తరం" అని వాల్మీకియే చెప్పుకొనియున్నాడు. ఇందలి శబరీ బాల్యవృత్తాంతము మున్నగువిషయములీ కవయిత్రి కే రామాయణభాగమందయినను గోచరించియుండవచ్చును. లేక కల్పితములనుకొన్నను భక్తివైరాగ్యబోధకములై జిజ్ఞాసువుల కుపకరింపగలవు. ఇందలి శబరీ బ్రాహ్మణసంవాదము నిమ్న జాత్యుద్ధరణమునకు మార్గదర్శకమై సర్వసమదర్శిత్వ ధర్మము నుద్బోధించుచున్నయది.

రచనలో నీకవయిత్రి యొక్కొక్కపట్టునఁ దనస్వాభావిక నిరాడంబర భక్తితత్పరత్వమును శబరీపాత్రముఖమున బ్రకటించుచున్నట్లుండును.

ఈ రచనావిధానమిా కవయిత్రికిం బ్రథమప్రయత్నమై నను నియమబద్ధమైమనోహరధారాశుద్ధితో విరాజిల్లుచున్నది. చూడుడు స్థాలీపులాకన్యాయముగా

ఉ. "ఆకలిబాధచే తమకునన్నముదెమ్మని చుట్టుముట్టి, చీ
కాకుగ నేడ్చుచుండిరదె గన్గొనుడాపసివారి నయ్యయో
కాకులుగూడ బిడ్డలకుగల్గగ జేయును పట్టెడన్న మే
కాకినినైన యాపనిత కష్టముదీర్చుట మాపుధర్మమౌ."

కం. అబలాజన దుర్లభమై
సొబగొందిన సత్కవిత్వ శుభసూక్తితతిన్
శబరిచరిత్రము నుడివిన
యబలకు శ్రీరాముడొసగు నాత్మబలంబున్.

| | |
|---|---|
| బోర్డుహైస్కూల్ | ఇట్లు, |
| పూళ్ల (ప. గో. జిల్లా) | అనిపెద్ది జగన్నాధశాస్త్రి |
| 18—12—1956 | ఆంధ్రపండితుడు |

# అవతారిక

సాధ్వీమణి భోగరాజు చిట్టెమ్మగారు రచించిన "శబరి" యను గ్రంథమును పరిశీలించి, విశేషపరితోషము నందితిని. గ్రంథము భక్తిరసభరితమై, గంభీరభావబంధురమై, వెలయు చున్నది. చక్కని జాతీయములతో, అలంకారములతో రసమున కనుకూలమైన శైలితో నొప్పుచున్నకృతి కవయిత్రి వైదుష్యమునుమాత్రమేగాక, గుణసంపదనుగూడ వ్యక్తీక రించుచున్నది. నిర్మలమానస దిశావలయమందే భాస్వదాశయ

ములు కసకసుకించినా సువర్ణమువలె తేజరిల్లును. పూతజీవిత మందేకదా యుత్కృష్టకవిత యుద్భవించును! శబరి జీవిత ప్రభావమును దలచిన జీవితమే ఉత్కృష్టకవితను సృజింపజాలును. ఆదర్శకవిత్వమునకును, భక్తికిని అవినాభావసంబంధముకలదని రూఢిచేయవచ్చును. సకలసద్గుణ నికురుంబమైన శారదాంబకు మేలికయినేతలను సమర్పింపజాలు ప్రతిభ యీ కవయిత్రికి కలదని ప్రస్తుతరచనవలన గ్రహింతుము.

ఆర్ష సంస్కృతి జగతిపై నిలుచునంతకాలము, ప్రపంచ మందలి మహాకావ్యములందు రామాయణము శమంతక మణివలె పరిఢవిల్లునంతకాలము పావనగుణ శోభితమైన శబరి మానవస్మృతియందు నిలుచును. జాతినిబట్టిగాక పూతహృదయ విభూతినిబట్టియే వ్యక్తిమహిమ నిర్ణయమగును. భగవంతుని భక్తుడు వెదకుచుండ భగవంతుడే భక్తుని యన్వేషించును. శ్రీరాముడు శబరిని కనుగొని యానందించిన ఘట్టమీ గ్రంథమున కడుకౌశలముతో చిత్రింపబడినది. వనవీధులందు మసలు స్త్రీకి, ధ్యానమగ్నులైయుండు మహర్షులకు నయితమవలీలగా లభింపని యీశ్వర కారుణ్యము లభించినది. కడుంగడు నిశితమైన మేధకు లభింపని సౌభాగ్యము విశాలహృదయమునకు లభించుననియు, మరందభరిత కుసుమహృదయమున చిక్కుకొన్న రేఫమునవలె, భక్తిభరిత హృదయప్రాంతమున భగవంతుడు నివసించు ననియు నీ గ్రంథము తెలుపుచున్నది. కోటి గ్రంథముల వ్యాఖ్యానములు ప్రసాదింపజాలని భాగ్యము ఒక్క శుభకరముహూర్తమున భక్తుడందు ఆనందానుభూతి వలన లభించును.

ఈ గ్రంథము సుగంధబంధుర ప్రసవము బోలునది. ఆంధ్రసాహితీకుంజవాటికయందు చిరకాలము శోభిలుచు భావసౌరభము నాస్వాదింపజాలువారికిది పరమప్రమోదమును ప్రసాదించునని హృదయపూర్వకముగ విశ్వసించు సోదరుడు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి M. A., B. L.
విజయవాడ.

# అభిప్రాయములు

## కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.

శ్రీ హనుమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న పరివారసమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీమతి భోగరాజు చిట్టెమ్మగారు రచించిన 'శబరి' యన్న కావ్యము చూచితిని. రచన సుకుమారముగా, సులభముగా నర్థమగునట్లు కలదు. పద్యరచన ధారాశుద్ధికలదిగా నున్నది.

ఈ గ్రంథమునందు భక్తియు, సంఘసేవయు ప్రధానముగా బోధింపబడిన విషయములు. ఎక్కువ యాధునిక భావములతో నిండియున్నది.

ఎన్నిమున్గన్నని యేరగలదు? శబరి శ్రీరామచంద్రుఁడు వచ్చుత్రోవలో తానుపడి దొర్లెననుట భక్తికవధి భూతముగా నున్నది.

అవివేకియయిన బ్రాహ్మణుడు శబరిని కొట్టుట, చెరువు రక్తమాంసమయమగుట, యివి క్రొత్త కల్పనలు. మొదటిది యీకాలపు భావము, రెండవది మధ్యకాలపు భావము,

మరియు శ్రీరాముడు శబరిని ప్రార్థించుమని మునులతో చెప్పగా వృక్షములు కదలింపక యుదకములు కదలించిరనుట చాల యూహనీక భావము.

శబరి చిన్ననాటి కథాకల్పన ముచితముగానున్నది. మొత్తముమీద భక్తిభావ ప్రాధాన్యమున నెన్నవగాఁ గలదు. రచన బాగుగానున్నది. ఈమెగారు ఇంకను భాషా పరిశ్రమచేసి మరియు నుత్తమ గ్రంథముల రచించుగాత.

## శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు

నిర్మలమైన హృదయం, నిర్వికారమైన భక్తిభావంవల్ల గాఢంగా ప్రేరేపణ పొందినప్పుడు ఎంతటి నిసర్గమనోహరమైన కవితను స్రవించగలదో యీ శబరికావ్యం చెప్పక చెబుతున్నది. శబరి భక్తిని తనయందు ఆరోపించుకొని, తనకు, శబరికి ఆత్మైక్యత ననుసంధించుకొని, శ్రీమతి భోగరాజు చిట్టెమ్మ యీ చిన్నిపాత్రంలో ఆ వేగపూర్వకమైన, యొక మహత్తర హృదయ సంక్షోభం వ్యక్తంచేసింది. అందువల్ల 'శబరి' కావ్యం సహృదయులందరికీ ఆదరణపాత్రం కాగలుగుతుంది.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

శ్రీమతి భోగరాజు చిట్టెమ్మగారు దైవభక్తిగల కవయిత్రి. ఈమె రచించిన శబరి యనెడి కావ్యము ఈమెకు సహజమైన భక్తిభావముతో నలరారుచున్నది.

ఈ శ్రీమతి, యాంధ్రసారస్వతమున మొల్లవలె స్థిర కీర్తికి పాత్రమగుగాక.

# తొలిపలుకు

తే. గీ. భక్తిమార్గము నెన్నంగ వశమటయ్యొ
వేయి తలలున్న యానాగ విభునకైన
నాల్గువేదాలు వల్లించు నలువకైన
పరమపావని శారదాభామకైన

తే. గీ. భక్తివలనను సత్ప్రథాసక్తి వొడము
భక్తి వలనను సంసారరక్తి దొలగు
భక్తి వలనను భుక్తియు, ముక్తి దొరకు
భక్తి మార్గంబునకు సాటి పథము గలదె?

అనిత్యము, దుఃఖ ప్రదమునైన యీ సంసార సాగరమునుండి మనల నా దేవదేవుని చరణ సన్నిధికి జేర్చు మార్గములలో భక్తి మార్గమే సులభమైనది. జగన్నాటక సూత్రధారియగు నా మహానుభావుడు భక్తియను రజ్జువుచే బంధింపబడి మన హృదయ సీమనుండి యొక్క డుగైన నావలఁ బెట్టలేడు. గజేంద్రుని భక్తిఁ దిలకింపుడు. "అలవైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబు దాపల" ఎక్కడనో శ్రీ మహాలక్ష్మితో సరస సల్లాపములాడుచు, శృంగార రసములో మునిగి తేలుచున్న యాతనిని పరుగు పరుగున వచ్చులాగున

జేసినది భక్తి ప్రభావము. ద్రౌపదీదేవి కొఱకు చీరెలపై చీరల వర్షము కురియు విధంబున జేసినది. ప్రహ్లాదుని కొఱకు భగవంతునిచే, నృసింహావతారము ధరింపc జేసినది. ఈ విధం బుగా నెప్పుడు జరిగినది? "నీవేతప్ప నితః పరంబెఱుగ మన్నిం పన్ దగున్ దీనునిన్, రావే, యీశ్వర కావవే వరద" యని గజేంద్రుడు తన సర్వస్వము నా మహామహునకు, నా కరుణా వరుణాలయునకు, నాదీనజన బాంధవున కర్పించినప్పుడే యాతని హృదయము కరిగి, యొక్క నిముసమైనను నిలువలేక. యర్ధాంగి యైన శ్రీమహాలక్ష్మితో జెప్ప వ్యవధి సైతములేక, శంఖము చక్రము గూడ ధరింపక, జుట్టుముడికూడ నూడిపోవు చుండగా పరుగు పరుగున వచ్చెను.

శబరి మహాభక్తురాలు. రామాయణములో నామె జీవితచరిత్ర మొక రత్నమువంటిది. ఆమె భక్తిప్రవాహములో నాచారమునకుc దావులేదు. డాంబికమునకుc జోటులేదు. మంత్ర తంత్రములతో నిమిత్తములేదు. జప తపంబులతోc బనిలేదు. యజ్ఞయాగాదులతోc బ్రయోజనము లేదు. గురు ముఖంబుననుండి యామె నేర్చుకొనిన దొక్కటే. రెండక్షర ముల నామము. రామనామము. అదియే యామెకు సర్వస్వ మైనది. సర్వకాల సర్వావస్థలయందు నదే ధ్యాస. చీమ చిటుక్కుమన్నను శ్రీరామచంద్రుడు డేతెంచుచున్నాడేమో యను తలంపు. ఆ నీలనీరదవిగ్రహునకు తియ్యని ఫలంబుల

నర్పించవలయునను కోరిక. అందులకై పండ్లను రుచిచూచెడి యీమె యమాయకత్వము. ఇంకేమి కావలయును? తపోనిష్ఠా గరిష్ఠులైన మునిశ్రేష్ఠు లందఱును తమ యిండ్లకు రమ్మని పిలుచుచుండగా "శబరి యెక్కడ, శబరి యెక్కడ" యనుచు కరుణాసముద్రుండగు రామభద్రుం డామెయొద్దకే యరుదెంచి ఆమె యిచ్చిన పండ్లను ప్రేమతో భక్షించెను. భక్తులను బాధించుటవలన నెంతటి పాపము సంభవించునో? యీ జడదారు లందఱకు దృష్టాంతపూర్వకముగా నిరూపించెను. దీనజన సేవయే దేవదేవుని సేవయని నొక్కి వక్కాణించెను.

పరమపావని యగు నా శబరి జీవితచరిత్ర తెలుగులో గ్రంథరూపముగా రచింపుమని నన్నుగన్న యీ నల్లనయ్య ప్రేరేపించగా మొదలిడి, యీ మహనీయుని యనుగ్రహముచేఁ బూర్తి గావించితిని. కాని, అశక్తురాలను, అసమర్థురాలను. వ్యాకరణమైనను సరిగా రానిదానను. ఎన్నియో లోపము లుండవచ్చును. కాని మహానుభావులు వచించినట్లుగా

"మూకంకరోతి వాచాలం పంగుం లంఘ యతేగిరిం
యత్కృపాత మహం వందే పరమానంద మాధవం"

ఆ సర్వాంతర్యామి యనుగ్రహమే మూగదానిని బోలిన నన్నిట్లు పురిగొల్పినది. సహృదయు లిందలి లోపములను మన్నింతురుగాక యని కోరుచున్నాను.

ఇందలి వ్యాకరణ దోషముల సవరించిన బ్రహ్మశ్రీ అనిపెద్ది జగన్నాథశాస్త్రులవారికి, శ్రీ పెండ్యాల సీతారామయ్య గారికి కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఇట్లు,

ర చ యి త్రి.

# అంకితము

---

శా. శ్రీరామా! భవదీయ పాదయుగమున్ సేవించు వారిన్ సదా
గారాబమ్మున జూచి బ్రోచెదుగదా? కారుణ్య యుక్తుండవై
నేరాలెన్న వదెంత మూఢులయిన న్నీదాపున న్జేర్చి, యా
ధారంబౌచు వసింతుగాదె, జగదాధారా! దయాంభోనిధీ.

ఆ. వె. అట్టి నీపదములకర్పింతు, నీకృతి
స్వీకరింపుమయ్య, చిన్నవారి
వచ్చిరానియట్టి పలుకులకానంద
పడెడు కన్నతండ్రి పగిది, దేవ!

---

## విఘ్నేశ్వర స్తుతి

గీ. గుజ్జురూపంబుతో పెద్ద బొజ్జతోడ
నొజ్జలకుగూడ నొజ్జయై, ముజ్జగముల
యొజ్జ పజ్జను నాడుచు నుండునట్టి
సజ్జ నావను, విఘ్నేశు, సన్నుతింతు. 1

గీ. అంబ వాహనమైన సింగంబు జూచి
కరిముఖుండొటచే భీతిగదురుచుండ
నెత్తుకొనుమంచు చేతుల నెత్తి, చాల
దూర మందున నిలబడు వీరుఁదలతు. 2

## ఇష్టదేవతా వందనము

సీ. నీల నీరదమునుబోలు దేహము వాని
చిరునవ్వు మెఱపుచే మెరయు వాని
ఘనకృపావృష్టి సజ్జనుల దన్పెడు వాని
దనుజుల కళని పాతంబువాని
దీనార్తి దీనుల దిక్కు-జూచెడివాని
సోముని గేరెడు మోమువాని
లలితసంఖ్యాక జీవులగాంచ గల్గునా
కర్ణాంత రుచిరాంబ కములవాని

ఆ. వె. ధరణిజాకళత్రు, దశరథ వరపుత్రు
భూతలేశు, పాప పుంజనాశు
నిరుపమానశౌర్యు, నృపలోకవర్యు, నే
మనమునందుఁ దలచి కనుదు శాంతి. 3

శా. అమ్మా! వేడితి నెన్ని మారులనొ మాయయ్యన్ దయన్ జూడగా
రమ్మాయంటిని, యూరకుంటతగవే, రక్షింపగా నన్ను చే
కొమ్మాయంటిని గాని కొంచెమయినన్ గోడాలకింపందు, సీ
తమ్మా! వేగమె జెప్పు నీవిభునితో తల్లీ! కృపావల్లిరో! 4

## వాల్మీకి మహర్షి స్తుతి

సీ. అతడెబో, రామాయణామృతలహరిని
మనకు నందిచ్చిన మహితమూర్తి
యతడెబో, శ్రీరామునంతటి వానిచే
పూజలందిన యట్టి పుణ్యమూర్తి
యతడెబో, వల్మీకమందున నుదయించి
తపసుల యెడయఁడౌ ధన్యమూర్తి
యతఁడెబో, సీతమ్మ యనుగుబిడ్డలఁ జాల
మక్కువ సాకిన మాన్యమూర్తి
ఆ. వె. యతడె రామనామమందలి మధురిమ
కడుపునిండ గ్రోలి కనదఖండ

శాంతి ననుభవించు సద్గుణాకరమూర్తి
సకల మానిబృంద చక్రవర్తి. 5

గీ. వెలుగులకు నెల్ల వెలుగయి వెలుగు వేడి
వెలుగు రేవెల్గు, నెందాక వెలుగుచంద్రుఁ,
వెలయు నీకీర్తి యందాక, పలుకగలమె ?
వెలను నీ కావ్యమునకు నీ యిలను మేము. 6

## పి తృ వ ం ద న ము

సీ. పూర్వుల్ల వంశాబ్ధి పూర్ణశశాంకుడై
సత్కీర్తి నెవ్వాఁడు చాలనొందె
కన్నబిడ్డల కెప్డు నెన్నరాని ధనంబు
రామనామం బిచ్చెఁ బ్రేమ నెవఁడు
నిజకులాచారంపు నియతిచే నెవ్వాఁడు
ఘనత గాంచెను బంధుజనమునందు
పాప పంకమునందు బడువారి నెవ్వాఁడు
మంచి మార్గముఁజూపి మనిచెఁ గరుణ

గీ. కష్టవనధిని మున్గుచు గాంచలేక
తీర మల్లాడుచుండెడి వారి జూచి
జాలి నేలెను నెవ్వాఁడు సాధుబుద్ధి
నట్టి నాతండ్రి దలతు నే నధికభక్తి. 7

సీ. శ్రీరామ పదపద్మ సేవచేఁ దనరారి
వారాశి గంభీర ధీరుఁ డగుచు
ధారాధరేంద్రుని దానంబునన్ గెల్చి
నీరేజ నళినిభ నేత్రుడగుచు
జాలి నార్తుల నెప్డు చాలగా బ్రోచుచు
'బాగుబాగని' యెల్లవారు బలుక
స్వార్థబుద్ధిని వీడి సకలంబు పరమాత్మ
మయముగా నెంచుచు మమత లుడిగి

గీ. ధర్మమార్గము వీడక నిర్మలాత్ము
డగుచు, లక్ష్మీనృసింహాఖ్యుఁడై తనర్చి
మోక్ష సామ్రాజ్యలక్ష్మిని బొందియున్న
ఘనుని నాతండ్రిఁ దలతు నెమ్మనమునందు. 8

## మా తృ వం ద న ము

గీ. భర్తమాటయె తనకును పరమవేద
సారమని యెంచి మది నొక్కసారిగూడ
నెదురువల్కక, పతిసేవ నెపుడుఁ జేసి
పుణ్యలోకంబు నొందిన పుణ్యరాలు. 9

గీ. లక్ష్మిదేవమ్మ యనుపేర లక్ష్మిదేవి
బోలి, దీనుల గన్నమ్మ బోలె ప్రేమ
గనుట నందఱు 'గన్నమ్మ' యనగ దనరి
నట్టి ననుగన్న యమ్మ నే నభినుతింతు. 10

# శ బ రి

## ద ర్శ న భా గ్య ము

తే. గీ. శ్రీలకాకరమయియుండె చిన్న చిన్న
తాటియాకులపాకలఁ దనరుచుండి
సౌధములుగల్గు నగరముల్ సాలనట్టి
యందచందాలతో మతంగాశ్రమంబు. 1

ఉ. అందున నుండు మౌనిగణమందధికుండు, తపంబునందు పే
రందినవాడనాథ జనమందున నక్కటికంబు గల్గు వా
డెందునగాని తామసము నెప్పుడు నెమ్మదిలేకజస్ర మా
నందముతోడ శ్రీహరి ననారతమున్ హృదినుంచు వాడొగిన్.

వ. అమ్మహాత్ముండు నిరంతరము భగవద్ధ్యాన సరస్సున నోల
లాడుచు భగవన్నామ మకరంద పానమొనర్చుచు, నా
మహామహుని రూపంబునే యహర్నిశలు దలపోయుచు,
మతంగుండనుపేర వరలుచుండు.

తే. గీ. ఆ తపోధను చెంగట నన్నివేళ
లందు 'సత్సంగమే' గాని, యన్యమచట
చూడగా బోము వినబోము, చూడ చూడ
మనము దేవునిపైనుండి మరలకుండు. 3

తే. గీ. ఆ మునిశ్రేష్ఠు మహిమచే నచటివారు
సంతసంబున ధ్యానంబు సలిపి, నిత్య
మైన సుఖముల నెప్పుడు ననుభవింతు
రెంత పుణ్యాత్ములో వార లెంచి చూడ. 4

సీ. చెప్పుచుందురు గదా చిన్నపిల్లలకైన
తారకమంత్రంబు తపసు లచట
ననుభవింతురుగదా మునివర సంఘంబు
లాత్మానుభూతి ననన్యదీక్ష
వచ్చు చుందురుగదా పరమపావనులైన
భక్తబృందము నిత్య భజన కొరకు
పలుకుచుందును గదా చిలుక గుంపులుగూడ
రామ రామా యంచు రాత్రి పగలు

తే. గీ. అచట కామాది షడ్వర్గ మన్న జాడ
కానబడ దద్ది మౌని సంఘములకెల్ల
వాసయోగ్యంబుగా నొప్పె వసుధయందు
పతిత జీవుల పాపముల్ వాపఁగలిగి. 5

ఉ. ఎచ్చట విన్న రామజగదీశ్వరు గూర్చిన సత్ప్రసంగమే
యెచ్చటకేగి కాంచిన మునీంద్రుల శాస్త్రపురాణ చర్చలే
నిచ్చలు వేదవాక్కులనె నెమ్మనమందున దాల్చుచుందురా
సచ్చరితాత్ములౌ ఘనులుసర్వముబ్రహ్మమంటచు నెంచుచున్.

వ. ఆ పురవరంబులోనున్న తాపసోత్తములు సద్గురు కొలువున కరుగు నవసరంబున నొండొరులను బిలుచుకొను క్రమం బెట్టిదనిన.

చ. వెలుపలిచూపుల న్వదలి, విశ్వమునంతయు బ్రహ్మరూపుగా
దలఁచి, దురంత సంసరణ తప్తజనాళి కపార సత్కృపా
కలిత దృగంచలమ్ముల సుఖంబొనగూర్చెడు దివ్యమూర్తి, ని
శ్చల సుతపోవిభాసి, గురుసన్నిధి జేరగ రమ్ము సోదరా. 7

శా. గంగాదివ్యతరంగిణిన్ మునిగి, వే, కామాది షడ్వర్గ, దు
స్సంగక్షోణిరుహాళి సోహమను భాస్వత్ఖడ్గ ధారాహతిన్
ద్రుంగం జేసియు సద్గురూత్తముని వాగ్రూపామృతాంభోధిలో
బొంగుల్వారెడుజ్ఞానరాశిగనుమా, మోక్షార్థివైయుండుమా.

సీ. ఒక క్రేవ శ్రీహరి వికచాబ్జ నిభనేత్ర
మకరందమును గ్రోలు మహితమతులు
నొకచక్కి విజ్ఞానయోగంబు దెలియంగ
నరుదెంచినట్టి యధ్యయనపరులు
నొకవంక లోకంబు సకలేశు మయముగా
భావించు నానందభరిత మతులు
నొకయోర మాధవు నకలంకనామంబు
బాడుచుండెడు భక్తి భావరతులుఁ

తే. గీ. గలిగి, కన్నులపండువై గణనగన్న
గురుమహాత్ముని కొలువున కరుగు భాగ్య

సరణి గల్గెను, ప్రాక్తనజన్మ పుణ్య
ఫలముచేతను మనబోటి పామరులకు. 9

తే. గీ. అనుచు దమలోన దాము రమ్మనుచు బిలుచు
కొనుచు, గురుసన్నిధికి నేగి, మనములందు
భయము భక్తియు గదురగ, పరమసౌఖ్య
భరితమగా బోధ విందురా పరమ మునులు. 10

తే. గీ. ఒక్కనాడు మతంగ గురూత్తముండు
ఛాత్ర సంఘంబులకు బోధ సలుపఁగాంచి
శబరి యన్కన్య యొక చెట్టుచాయనక్కి
వినగసాగెను మోదాంబుధిని మునింగి. 11

వ. ఆ శబరియొక్క జీవిత వత్తాంతం బెట్టిదనిన

తే. గీ. పంక మం దుద్భవించిన పద్మమామె
మలయు గంజాయి మొక్కలఁదులసియామె
ఘనతరాజ్ఞాన గాంఢాంధకార భరిత
జగములకు వెల్గునొసగెడు జాణయామె. 12

తే. గీ. హింసతో నిండియుండెడు హీనకులము
నందు జనియించియును మనమందుఁ గరుణ
చాల గల్గుటచే నెప్డు జాలినొందు
జంతు హింసనుజూచు నా సమయమందు. 13

తే. గీ. తల్లియును దండ్రి బంధులు తక్కుజనము
మేళ తాళంబులను సదా మేళవించి
కాళికాదేవి గుడికి సింగారమొప్ప
తోలుకొనిపోవు పశువుల 'జాలి' గాంచి. 14

క. కనులను నీర్నించుచు, దా
మనమునఁ దలపోసి పోసి మంచిదె? యిట్టుల్
కనికర మేమియు లేకను
చనునే మడియింప భూతసంఘము నెపుడున్. 15

ఉ. అక్కటికంబు లేక మదియం దిసుమంతయు, నల్లతాతితో
చెక్కిన గుండె లేమొ! గుడిజేరిచి నోరును వాయిలేని యా
చక్కని జంతుజాలమును జంపుట లా జగదంబ ముందు, పెం
పెక్కిన ధర్మమే! తలప నెంతటి క్రూరులో వీరలందఱున్. 16

సీ. కన్న సంతానంబు కడుపారగా మ్రింగు
కఠిన మనస్కవే? కాళికాంబ!
పసిబిడ్డలను బోలు పశువుల మెసవెడి
నిర్దయ స్వాంతవే? నిఖిల జనని!
ఆత్మ సౌఖ్యమునకై యనదల పీడించు
దుష్టాత్మురాలవే? దురితదూర!
సర్వభూతముల నాశనము చేయఁదలంచు
మృత్యుదేవతవె? యో సత్యశీల!

తే. గీ. మాతరో! నీకు జోహారు మానుమమ్మ
బలిని గొనుటలు, జీవుల బాధమాన్పి
ఘనకృపాదృష్టి వానిని మనుపుమమ్మ
యనుచు జింతించు శబరి తా మనమునందు. 17

సీ. ధర్మమా, యిది నీకు తగు మార్గమా, జూడు
మా, వీని ననుకంప మాత యనును
ప్రోవుమా, బలిగొన మోదమా, యిది నీకు
న్యాయమా యనుచు నా యమ్మ నడుగు
భారమా, యిది మాదు పాపమా, యింతటి
కోపమా యనుచును గుందుచుండు
నుచితమా, యిది నీకు నొప్పిదమా, యింత
ఘోరమా యనుచు దా గొణుగుకొనును

తే. గీ. వీడుమా యింక బలిగొను విధము ననును
చూడుమా జీవులనుదయ జూడు మనును
మాను మీకోపమంచుఁ దామానసమున
వేడుచుండును దేవి నావెఱ్ఱిపిల్ల. 18

క. తల్లీ! గౌరీ! యిట్టుల
నుల్లంబున దయ యొకింత యుంచక వీనిన్
జెల్లునె? బలిగొనుటలు, వే
చల్లవె! నీ ప్రేమవృష్టి సదయహృదయవై. 19

వ. ఇట్లు చింతించుచుండ నొక దినంబున చెలికత్తెలు శబరితో, చెలీ, నీకు పెండ్లియగును. నీ తలిదండ్రులు నీకు వివాహంబు సేయుటకై యొక సుందరాంగుని వెదకిరి, యాతని పరాక్రమంబు గురించి విను మని యిట్లనిరి.

చెలియ! నీ సుభగుల
ఆ. వె. ~~చెల్లెలా! నీవెంత~~ శ్రీమంతురాలవే
నీదు వరుడు చాల నిపుణుఁడమ్మ!
వానివిక్రమంబు వర్ణింప వశమటే
ధాతకైన వాని తాతకైన. 20

సీ. పోయెనా వేటకా చాయఁలంగలిగిన
మృగరాజి యంతయు మృతినిబొందు
వదలెనా బాణంబు వనములోనుండిన
పక్షులన్నియు నేలఁబడుచునుండు
పట్టెనా బల్లెంబు గట్టిగా కరమునఁ
గ్రూరజంతువులైనఁ గూలిపోవు
వేసెనా యొక కేకగాసి జెందుచు జీవ
రాశి యాశలవన్ని నాశమగును

గీ. గుండెయతనిది లోహపుగుండు సుమ్ము
ధైర్యమున నందరిని తలదన్ను నాత
డమ్మరో! శౌర్యమాతని సొమ్ము సుమ్ము
సందియములేదు నమ్ముమో సుందరాంగి. 21

ఆ. వె. నీదు చక్కదనము నీ యొయ్యారపుగూడ
నతడు నూచినాడె యబ్జనేత్ర
మొన్న నీవు పూలమొక్కలలో నున్న
కలువుదీయునట్టి కాలమందు. 22

ఆ. వె. ఆమెగాంచి యింక నాగలే ననుచును
గూర్పుఁ డామె నాకుఁ గోరి తనుచు
వార్తనంపె మాకు వనితరో ! మామాట
నమ్ముమమ్మ ! నీవు నెమ్మనమున. 23

వ. ఆ జాబులోని విశేషంబులను వినుము.

ఆ. వె. నా వరాలమూట, నారాణి, నాదేవి
నిన్ను నమ్మికొంటి నన్నుగావు
కౌగిలించి వేగ కాపాడవే ప్రియా
నిలువలేనె యింక నిముసమైన. 24

క. బంగరుబొమ్మా! ముక్కుకు
ముంగెఱఁ జేయించి నాఁడ, ముత్తెపుఁ బేరుల్
సింగారింతును నీమెడ
సంగీతము బాడుకొనుచు చక్కగరావే. 25

క. కలరా నీ రూపమునకు
తులదూగెడువార లితర తోయజనేత్రల్

వలరాజు శరము లేయుచు
నలయించుచు నున్నవాఁడె యబ్జదళాక్షీ !. 26

గీ. ఉలికిపడె దేల కొమ్మరో ! తళుకు బెళుకు
లొలుకు నీ రూపమునుజూడ నలువకైన
గలుగకుండునె మోహమ్ము ? కొలువకున్నె
జలజములఁ బోలు నీ పాదములను దాను. 27

ఉత్సాహము :—

నన్ను కౌగిలించి వేగ నాదు తాపమార్పవే
నిన్నుదప్ప నేరిగూడ నే నెఱుంగనే ప్రియా
యెన్నరాని యందమంత యెంత నీకు గల్గినన్
నన్ను తాంగి బింకమింక చాలు చాలు చాలునే. 28

వ. ఆమాటల విని యామె క్రోధంబుతో నచ్చటనుండి లేచి తన యింటికిం జనియె. నిట్టు లాబాల యంధకార పరివృతంబైన యాకాశంబున శశిరేఖంబోలె, దుష్టులైన యా యాటవికుల మధ్య జన్మించి, ప్రతిదినంబునందు తన కన్నెదుటనే జరుగు హింసాకాండను జూచి నెమ్మనంబున దిగులొందుచు మాటి మాటికి నాజగజ్జనని వేడుకొనుచు కాలంబు గడపుచుండ, నామె షోడశ వర్షప్రాయయైన, వివాహంబు సేయఁదలంచి తలిదండ్రు లొక దివసంబునందా బాలికను దగ్గరకుఁ బిలచి.

క. అమ్మా! పెండిలిజేసెద
మమ్మా! నీవెఱ్ఱిమాను మమ్మా! యింకన్
రమ్మా! యిటులన్ ముద్దుల
గుమ్మా! నీ మనమునందుఁ గుందగనేలా. 29

వ. కన్నతల్లీ! నీకు యుక్తవయస్సు వచ్చినది. నీ వయోరూపములకుఁ దగిన వరుని వెదకితిమి. మామాటవినుము, వివాహంబుఁ జేసికొనుము.

ఆ. వె. వెఱ్ఱితల్లి! యింత వెఱపేటికే నీకు
సంతసంబునొందు సమయమందు
మంచి యందగాడు మరి విశ్వవిఖ్యాత
విక్రమంబుతోడ వెలయువాడు. 30

ఆ. వె. భాగ్యవంతుడతని భార్య వయ్యెదవేని
కలుగు ముదము మాకు గాంచెదమ్మ
సకల సుఖములనుచు జననియు జనకుండు
పలుకుచుండు పలుకు పలుకునకును. 31

వ. చెలికత్తెలు జెప్పుచుండెడి యా వరునియొక్క హింసాపూరిత హృదయంబు జ్ఞప్తికిరా.

ఉ. కన్నులయందుఁ దాను కరకంజముజేర్చి, మొగంబువంచి,నా విన్నప మాలకింపుడికఁ, బెండిలిమానిన మంచిదంచు నే

నెన్నివిధాలనో పలుక నిప్పుడుగూడను తత్ప్రయత్నమే
పన్నుదు రేల!నయ్య! యిది పాడియె? నా మొర నాలకింపుడీ. 32

తే. గీ. వలదు వలదయ్య ! పెండిలి వలదు వలదు
నాల్గురోజులదయ్య ! యీ నాటకంబు
హాయిగా నేను భగవంతు ననుదినంబు
మనమునందునఁ దలచుచు గనెద సుఖము. 33

తే. గీ. హింసతో నిండియుండెడి హృదయ మతని
దనుచు, దయ కొంచెమేని లేదనుచు వింటి
వాని మెడ కంటగట్టుట వలదు వలదు
దయ నొకింతయు మీరలు దలప కిపుడు. 34

క. అయ్యా ! నా మనవిని విను
మయ్యా !, పెండ్లేలనయ్య ? హాయిగ నిరతం
బయ్యాదిదేవు గొలుచుచు
నియ్యెడనే బ్రతుకు గడుప నెంచితిఁ దండ్రీ. 35

వ. ఆమె మాటలకు నవ్వుచు తలిదండ్రు లిట్లనిరి.

ఆ. వె. ఇంత వెఱ్ఱిదాన వేమందు మమ్మరో ?
చిన్నతనముచేతఁ జెప్పుచుంటి
విట్లు, మాదు మాటనిప్పుడు విన్నచో
సంతసింతు పెండ్లి జరిగినపుడు. 36

ఉ. అప్పుడు నీవు నా దరికి 'నయ్యా' యటంచును వచ్చి, 'సంతసం
బుప్పతిలంగ నా మగనియొద్దకు బోవుచు నుంటినంచు, నే
నిప్పుడు సౌఖ్యసంపదల నెంతయు బొందుదు'నంచు బల్కవే!
యిప్పగిదిన్ వచించుటది యేల నె! యేమియెఱుంగ వక్కటా!

ఆ. వె. వాని జూచెదేని బాలరో! యొకసారి
పోవునమ్మ వెట్టి, పొందెదీవు
ముదమునంచు బలికి యదయత వారలు
పరిణయంబు సేయ త్వరితగతిని. 38

వ. ప్రయత్నంబుల జేయుచు తమ చుట్టముల కెల్లరకు నీ విషయంబు నెఱింగింప వార్తావాహులంబంపిన, వారలందఱు నమందానంద కందళిత హృదయారవిందులై వధూవరులకీయ వివిధంబులైన బహుమానంబుల గొనుచు నేతెంచిరి. ఇవ్విధంబుగా నామె వివాహముహూర్తంబు డగ్గరె.

ఆ. వె. పరిణయంబన్న నెంతయో భయముపడెడి
బాల, యేమి యెఱుంగని గోలయకట
బాధ నందుచు మనమున బహువిధముల
"నేమిజేసెదనింక నాకేదిదారి". 39

వ. అని చింతించుచు

సీ. చెలికత్తెలనుజూచి చెప్పుకొందమటన్న
వారుగూడను నవ్వువారలైరి
తల్లిదండ్రులు నన్ను దయజూతురాయన్న
నైహికంబే వారి యాశయంబు
అన్నదమ్ములు కొంత యనునయించెద రన్న
నిహభోగములె వారి కీప్సితములు
అక్కచెల్లెండ్రపై నాశయుంచుదమన్న
పెండ్లియే వారికి విహితమయ్యె

ఆ. వె. పెండ్లి సమయమందు విందులుసేయఁగఁ
బశుగణంబు సిద్ధపరచినారు
గొంతుకోయ, నిట్టి కులముల కాళికా
యెట్టులుద్ధరింప నెంచితమ్మ!. 40

సీ. కనులను నీర్నించి గాంచుచు నావైపు
న్యాయమా యిదియంచు నడుగునట్లు
నోరుమాలిన మమ్ము నూరకే వధియించు
టర్హమా యనుచు మాటాడునట్లు
దయలేక యుండుట ధర్మమే యనుచును
పలుమారు రెట్టించి పలుకునట్లు
మము గోసి మెసవుటే మానవధర్మమా
చెప్పరే యని పృచ్ఛ చేయునట్లు

తే. గీ. వీని నేత్రములందునఁ గానఁబడుచు
నున్న వీ యూహలన్నియు నుచితవృత్తి

పాపమీ దిక్కుమాలిన పశుగుణముల
సాకుపెట్లని యెంచు నాశబరి మదిని. 41

శా. రేపే నాకిక పెండ్లి మృత్యువయయో రేపేగదా పీనికీ
యాపన్నత్వమువాపువారెవరొకో, యన్యాయమార్గమ్మునన్
బాపంబంచునుగూడ నెంచరుగదా, పాలింపవే, తల్లి ! గౌ
రీ ! పాశాంకుశ పుష్పపాణి! గిరిజా! శ్రీపార్వతీ! శాంకరీ. 42

వ. అని తన గోడంతయు నామె కెఱింగించుచు, కరంబులు
జోడించి యా త్రిలోకమాత యెదుట నిలువంబడి.

తే. గీ. ప్రార్థనము జేయుచున్న యాబాల కపుడు
తోచెనొక యూహ మదియందుఁ, దొలగిపోయె
దుఃఖమంతయుత్రుటిలోన, ద్యుమణికిరణ
దర్శనంబున మాయుమహాతమముపోల్కి. 43

తే. గీ. అప్పుడా కన్నెమిన్న యత్యధికమైన
యుల్లసంబున నాదినమెల్ల గడపి
నిదురసాలించి, నడిరేయి, మదిభయమ్ము
వదలి, యెటకేనిబోవ భావమునఁ దలచె. 44

వ. కాని

క. ఎటకేగవలయునో ? యె
చ్చట నిల్చిన దనకు హృదయశాంతి దొరకునో ?

పటుతర విషయాకర్ష ణ
మెటగనగారాదా ? సుంతయేని యెఱుగ కే 45

వ. ఆకరుణా ప్రపూరితహృదయ, యాదినమం దద్దమ రేయిని పీటలమీాద పెండ్లి విడనాడి, యరణ్యామార్గంబు వట్టి, యా యంధకారంబులో గమ్యస్థానంబు గూడ నెఱుంగక యిచ్చ వచ్చిన తెరంగునఁ జనుచుండె.

తే. గీ. పరుగు పరుగున జనెడి యాబాల మదిని
చుట్టములలోన నెవ రేనిజూచి తన్ను
గుర్తు పట్టుదురను శంక కుదురు కొనియె
సహజమేగద కన్యకు జడుపు జగతి. 46

వ. అట్లు పరు గెత్తుచు నా పిచ్చిపిల్ల యీావిధంబుగా నాలోచింపఁ దొడంగె. వారలు నన్ను పట్టుకొనినచో నాకు మరల నానరకమే లభించునుగదా ! ఏమిచేయుదాన, దైవమా ! నా కేదిదారి. తల్లివి దండ్రివి నీవేయనుచు నేడ్చుచు,

ఉ. అప్పుడు వారలందఱును నయ్యకు నావిధమెల్ల సెప్పగా
తప్పక నన్ను బట్టుకొని దండనజేయు మనంబునందు దా
నుప్పతిలంగ కోపమసి యూాహనొనర్చి, భయంబుజెందుచున్
చప్పుడుచేయకుండయొక సాలము చాటుననక్కి-చూచుచున్.

తే. గీ. కొంతసేపట్లుగాంచి యాపొంత నెవరు
లేని యవ్విధ మారసి, లేదు భయము

టంచు దలచుచు, పోవుచో మంచిదనుచు
పదువులెత్తగసాగె నాబాల యపుడు.

క. దీనులగాచెడి దైవమె
దీనార్తికయైన చెలికి దిక్కై ప్రోచెన్
లేనియెడల నారేయిని
దానెచనగలదె యామె ధైర్యముతోడన్.

తే. గీ. దైవకృపగల్గు వారలు దాటనేర్తు
రీ భవాంబుధి ననినచో, నేమికష్ట
మామె యాయర్థరాత్రిని యడవిదాటు
టనిన యాశ్చర్య పడనేమి యవసరమ్ము ?

సీ. కటిక చీకటిలోన కాళ్లక్రిందను బడ్డ
పాములుగూడను ప్రక్కకొదిగె
యెదురుగా గర్జించి యేతెంచు సింహముల్
పిల్లికూనల మాడ్కి పెడకుదొలఁగె
గాండ్రని పైబడ గమకించు బెబ్బులుల్
మగువ కన్పడినంత మార్గమొసగె
బలిసి పర్విడెడు నక్కల ఘాతుకమ్ముగాళి
కరుణతో చెలికి స్వాగత మొసంగె

ఆ. వె. చిత్రమేమి గలదు ! శ్రీవల్లభుడు కరు
ణించి ప్రోచునపుడు, కొంచెమేని

భయము గల్గఁబోదు, భవబంధములు దెగు
నాదిదేవు నతని నాశ్రయింప. 51

తే. గీ. ఇట్టులా కన్నె యిడుముల నెంచకప్పు
డైదు దినములు పర్వెత్తె, నలస టనెడు
మాట యెఱుఁగక, యౌర! యిమ్మహిని పరము
నెంచువారల కిహమన్న నెంత భయమొ! 52

వ. ఈప్రకారంబుగా నామె తన యిచ్ఛవచ్చిన తెఱంగునఁ జనుచుండ.

తే. గీ. ఆమె భాగ్యము కొనియాడ నలవి యగునె?
శిష్యకోటికి బోధల జేయుచున్న
ఘనుని నొక్క మునీశ్వరుఁ గాంచెనామె
తన పథంబున తానేగు తరుణమందు 53

వ. ఆ మహాముని సమీపంబునకు బోయి, నమస్కరించుటకు వీలులేని కులమం దుద్భవించుటవలన నామె యొక చెట్టు చాటున నక్కి యా తపస్వి వరుని వాక్యంబులు వినసాగె.

తే. గీ. కూరుచున్నారు గుంపుగాఁ గూడి కూడి
సాలభంజిక లట్టులా శాలలోన
కదలికయు లేక శ్రోతలు కన్నురెప్ప
లైన వాల్పక గురుబోధ లందుకొనగ. 54

తే. గీ. గాంగ నిర్ఝరతుల్య వేగమును గాంచి
యమృత మాధుర్యమును మించి యతని బోధ
వినెడు వారల మైమరపించి వారి
మనములను ముంచె నానంద వనధియందు. 55

క. భవముల లోపల నుత్తమ
భవమీ మానుషభవమ్ము, భగవానుని సం
స్తవ మాచరింప, నేత్రో
త్సవముగ తన్మూర్తిగాంచి తన్మయమందన్. 56

క. కరచరణాదుల జగదీ
శ్వర సేవలనుంచి, భావజగతీస్థలిఁ ద
న్నిరుపమ సౌఖ్యమ్మున మై
మరచుట యేధాత్రి ముక్తిమార్గము సుండీ. 57

క. భోగ విలాసమ్ములఁబడి
యోగీశ్వర సేవ్యుఁ బూరుషోత్తము, హరి, న
య్యాగమ వేద్యుని మరచుట
యోగిరముగ విషము నోటనుంచుట యెసుడీ! 58

క. చేయక పరగుణ నిరసన
మీయక నీచులకు చనవు నెత్తరినైనన్
డాయక దుష్టజనంబుల
చాయకు, నిరతంబు ముక్తిచాయలఁ జనుడీ!. 59

క. కొట్టిన దిట్టిన బాధల
బెట్టిన నిందాళిపైన బెట్టిన నైనన్
పుట్టగ నీయకు కోపము
పట్టుగదా తామసంబు భవములకెల్లన్. 60

క. మెఱపున్ బోలెడు నీభవ
నరకములోఁగూలి నీశునమ్మక, సుఖపున్
దెరువు నెఱుంగరు, శ్రీహరి
చరణంబులు గొలువముక్తి సమకురు మీకున్. 61

క. పరము ననంతుని నచ్యుతు
నిరుపమ తేజస్స్వరూపు నిఖిలాధారున్
శరణాగతార్తి భంజను
కరివరదునిగొల్వ ముక్తిఁగాంతురు మీరల్. 62

క. నశ్వరముగా భవాంబుధి
విశ్వంబంతటను వెలుగు విష్ణుని, శౌరిన్
శశ్వద్భ్రాజిత కీర్తిని
శాశ్వతు, శర్వాది వినుతు, శాంతాకారున్. 63

క. సర్వజ్ఞు సర్వరక్షకు
సర్వాత్ముని సర్వవరదు సర్వాధారున్
సర్వమయు సర్వసాక్షిన్
సర్వేశు మునీంద్ర హృదయ సారసమిత్రున్. 64

క. ఖరకర తేజు ఖరాంతకు
కరికరనిభ బాహు యుగళు కరివర వరదున్
ఖరకంఠ లుంఠనోత్సుకు
కరకంఠ సతీనుతాంఘ్రికమలున్ రామున్. 65

క. భవరోగవైద్యు, నీరజ
భవవందిత పాదపద్ము, భవనుత చరితున్
భవమిత్రు, భవవినాశను,
భవనాశన రహితు, సకల భయ విరహితునిన్. 66

క. సేవించి, విష్ణుమయముగ
భావించి ప్రపంచమెల్ల, వరదు పరంబున్
గావించి కర్మజాలము
జీవింపుఁ డనాథ వితతి సేవల నెపుడున్. 67

గీ. సాగిపొండయ్య యీదారి సాగిపొందు
భక్తిమార్గమే యేకైకపథము, నుగమ
మఖిల జనగమ్య మిద్ది, యనాది సిద్ధ
మవని సర్వార్థములు దీనియందె దొరకు. 68

గీ. వెలుగులకు నెల్ల వెల్గయి వెలయుచున్న
'యతని'ఁ గాంచిన జన్మమే యధికమనుచు
పలుకుచున్నారు పెద్దలు 'కలశదక్కి'
నడచిపోవుద మాదారి నమ్మకముగ. 69

గీ. ఇప్పుడేగాని పరమేశు నింక మనము
వేరు జన్మంబులందున వెదుకలేము
అగ్గికిన్ జేయిగాలిన యంత లేచి
వెదకి యాకుల దెచ్చుట వృథయె గాదె. 70

గీ. మేలుకొనుడయ్య మీరింక మేలుకొనుడు
కలలఁగాంచుచు జీవిత కాలమెల్ల
మనుజ జన్మము వ్యర్థమై దనర నిట్లు
విషయ సుఖములలో విఱ్ఱవీగనేల. 71

గీ. ఈశరీరంబు మీదిగాదెపుడుగూడ
నీగృహంబును మీదిగాదెపుడుగూడ
నీధనంబును మీదిగాదెపుడుగూడ
రావు మీవెంట 'నచటికి' పోవునపుడు. 72

గీ. మట్టికొరకయి యేడ్చెదు మందబుద్ధి
కలిగెనా ? మీరలెటనేనిఁ గాంచినారె ?
మట్టిగలసెడు నీరక్తమాంస కలిత
చర్మపాంచాలి కలకు నాసలువహింప. 73

ఆ. వె. జన్మమొందనేల చావంగనేల యీ
పాడులోకమందు, పాడుకొనుడు
దేవదేవుగూర్చి, దిక్కులేని భవంబు
నమ్మికొన్న ఫలము నమ్మగాదె ? 74

క. ఎనుబదినాలుగు లక్షలు
గను జెప్పిరి జీవకోట్ల ఘనులౌ పెద్దల్
వినుడిక నరజన్మంబది
గనుగొన దుర్లభమటంచు గణుతించి మదిన్ 75

క. చేయుడు సజ్జనసంగతిఁ
బాయుడు మీ మమతలెల్లఁ, బరమాత్మునకు
న్నీయుడు సర్వస్వమ్మును
వేయుండా శత్రులాఱు విధముల వారిన్. 76

తే. గీ. వేరెలేడా దయానిధి, విశ్వమెల్ల
నతనిరూపమె నిశ్చయమయ్య యిద్ది
విశ్వమానవసేనయే విభునిసేవ
యాతనిని జేరుత్రోవ మీకందఱకును. 77

మ. అదిగో, నాదెస జీర్ణమౌ గుడిసెలో, నాకుక్కి-మంచంబులో
కదలంజాలక, దీర్ఘరోగములచే కాయంబు శుష్కింపగా
మదిలో నాశయొకింతలేక తనకున్ మందిచ్చి రక్షించు నా
సదయాత్మల్ మఱియెవరులేర నెడు నాసాధ్వీమణిన్ గాంచుడీ.

ఉ. ఆకలిబాధచే తమకు నన్నము దెమ్మని చుట్టుముట్టి, చీ
కాకుగ నేడ్చుచుండిరదె గన్గొనుడా పసివారి నయ్యయో
కాకులుగూడ బిడ్డలకుఁ గల్గఁగఁజేయును పట్టెడన్న మే
కాకినియైన యా వనిత కష్టముదీర్చుట మీదు ధర్మమౌ. 79

ఉ. మానవసేవఁ జేయుటయె మాధవసేవ యటన్న మాట మీ
మానసమందు నెంచి, యనుమానముసుంతయుఁబూనఁబోక, య
జ్ఞానముఁ బారఁద్రోలి, భవసాగరమున్ దరియింపుడయ్య, వే
పూనుకొనుం డికన్ హృదయపూర్వకమా పతితార్తసేవకై.

తే. గీ. పిల్చుచున్నాడు దేవుండు వీధివీధి
దిరుగు భిక్షుకరూపాన మఱపులేక
మన మెు? యెదుటనె 'యతనిని' గనగలేక
నందు నిందును వెదకుచు నుందు మెపుడు. 81

తే. గీ. అడవులందున దిరుగుచు, నాకలములఁ
దినుచుఁ దిరిగెద మతనిని గనుగొనంగ
'నతడో'? దిక్కెవ్వరును లేనియట్లు దారి
ప్రక్క దొర్లెడు నీగలు పైన ముసర. 82

తే. గీ. దీనులను జాలి గనుటయే దేవుపూజ
వారి మంచినిఁ జూచుటే వానిసేవ
యన్ని జీవుల దయఁగన 'నతడు' గూడ
మనల వెన్నంటి మనతోడ మసలుచుండు. 83

తే. గీ. అన్ని ప్రాణులలో నుండె 'నతడు'ఁ గాన
వారి సేవయె 'యాతని'ఁ జేరు త్రోవ
యన్యమార్గము లెంతటివైన, దీన
సేవకును సాటిరావు మీ జీవితములఁ. 84

తే. గీ. అందఱును వాని బిడ్డలే యాటవలన
నంతటను వాడె వ్యాపించి యఁలరు కతన
జేయుడీ వేగ మానవసేవ, దాన
ము క్తిఁగాంతురు మీరు నమ్ముడు నిజమ్ము. 85

ఉ. నమ్ముడు నాదుమాట, మది నాయము గాంచుడు,
మోక్షలక్ష్మి మీ
సొమ్మనియెంచుడయ్య, యిదిచోద్యమటంచు దలంపకుండ, బీ
రమ్ములు పల్కఁబోక, భవరాశిని దాటగ సేవజేయ, మీ
గుమ్మమునందె నిల్వబడు కోరిక లిచ్చుచు దేవుఁడెప్పుడున్.

తే. గీ. కన్నులారగ నీశ్వరుఁగాంచుకోర్కె
మానసమునందుఁ గలదేని, మహితబుద్ధి
నార్తజనులను బ్రోవు డత్యధికమైన
కరుణ, వైకుంఠనాథుడు కదలివచ్చు. 87

తే. గీ. ఆ మతంగుని బోధలనన్ని వినెను
గాని శబరికి యర్థముగాకపోయె
నైన కోరిక మనమునం దధికమయ్యె
మానివరు చెంతజేరి నమస్కరింప. 88

వ. కాని యట్లుచేయుటకు వీలులేని కులమునందుద్భవించుట
వలన నచ్చటికి జనలేక, యెన్నియో విధంబుల.

ఉ. యోచన(జేసి) చేసి, యయయో నధమాధమ వర్ణరాల, నే
నీచ నిటన్ వసించుటకు నిక్కమయోగ్యమను వాకువచ్చి, ఛీ
ఛీ, చనుమన్న నాకునిట చేయున దేమి, పరాత్పరా! ననున్
గాచెడి వార లెవ్వ రెటుగాంచెద నీ మునివర్యు సత్కృపన్.

ఉ. లేచెద చాల(బ్రొద్దున నె లేవక యుండగ మాని సంఘముల్
జూచెద వారి(త్రోవ, పరిశు(భము(జేసెద ముళ్ల నన్నిటిన్
వై చెదనగ్నిలోన, మరివారి కుటీరము వెన్క నెప్పుడున్
గాచుకయుండి వారు ననుగాంచని రీతిగ మంచిమాటలన్.

క. వినెదను నే నెప్పుడు, వే
చనెదను సన్మార్గమునను చక్కని పదవిన్
గనెదను, దేవుని గొలుచుచు
మనెదను; నాపూర్వ పుణ్యమహిమ దలచుచున్. 91

తే. గీ. అనుచు దలపోయు సంతసమందు, ధాత్రి
నాదు భాగ్యంబు నెన్నంగరాదుగా యు
టంచు గర్వించు మదిలోన, కొంచెమైన
కల్లకపటంబు లెఱుగని కన్యగాన. 92

వ. ఇట్లామె మహాభయముతో నామునికుల తిలకుని యెదుటకు
జనలేక, తానాలోచించిన (ప్రకారంబుగా జేయుచుండె.

---

# ఉ ప దే శ ము

ఉ. అంతట నొక్కనాడు ఘనుడైన మతంగుడుఁ బల్కెఁ బ్రేమతోఁ
జెంతను గూరుచున్న తనశిష్యుల నందఱఁజూచి, యెంతయో
వింతగ నున్నదిద్ది! కడు వెల్తిగ దాగనరాని రీతిగా
పుంతలు బాగుఁజేయు మనముంగిటఁ బెట్టును దర్భ లెప్పుడున్.

తే. గీ. ఎపుడు లేచునో? యేమొ? దానెపుడు మనకు
కంటఁబడకుండ పనిఁజేయుఁగా నిశీథ
మందు, పగలెప్పుడైన నేసందులందు
నైనఁ గాన్పింప దిదియేమి యబ్బురంబొ! 2

వ. ఆమె యెవరో తెలియదు. ఇంత నిస్స్వార్థభావముతో
సేవజేయుచున్నది. దానికి కారణంబేమో యెఱుంగరాదని
పల్కుచున్న మునివరుని వీక్షించి అప్పు డక్కడున్నవా
రందఱును బాలకులే యాటవలన నాతని చుట్టుముట్టి
సంభ్రమాశ్చర్యములతోఁ బ్రశ్నవర్షము కురిపించిన ఆ
మతంగ మహర్షియు.

ఆ. వె. నిద్రఁబోవకుండ నేర్పొప్పగా మీరుఁ
గాచి రాత్రియంతఁ, గాంచవలెను
పడతిజాడఁ, గాన పదిలమ్ముగాఁ జేయ
వలయు నుండి యనుచు బలికె నపుడు. 3

గీ. అందఱునుగూడ చాల నానందపడుచు
గంతులను వేయు చెదుటనె గలడు గురువ
టనెడు మాటను గూడను మనములందు
దలపఁగాఁ బోక యిట్లని పలికిరంత. 4

సీ. గురువునాజ్ఞను నేను శిరసావహించెద
నటకు నేబోదు నంచనియె నొకడు
నీవల్ల నేమౌను ? నేనె యచ్చటికేగి
వారిఁ గాంతునటంచు వదరె నొకడు
చేయలేనే నేను చేసి చూపెదనంచు
శపథంబుఁజేసె సచ్ఛాత్రు డొకడు
నేనె యీపనిజేతు నీవు రావలదంచు
వాదులాడె మఱొక్క బాలకుండు

ఆ. వె. నేనె బట్టుకొందు నేనె మేల్కొనియుందు
నేనె బోదునటకు నేనొనర్తు
నేనునేనటంచు నేనంచు వారలు
తగవులాడ నగుచు తపసిపలికె. 5

ఆ. వె. పిచ్చివారలార, పెదపెద్దమాటలు
పలికి, వాదులాడు పనికిఁబూను
కొంటిరేల, యిట్లుకొట్లాడ పాడి యీ
యెంచి మిమ్ము పంప నెంచినాడ. 6

చ. అని పదిపేర్లఁ జెప్పి గురుడాౌనన వారలు మోదవార్ధిలో
మనములు ముగ్గుచుండ, కడుమన్ననఁ గోడ నమస్కరించి, వే
జనిరి కుటీరభూములకు "చయ్యనబట్టుద మామె నిప్పుడే
మునివరు చెంత జేర్చెదము పూనికపీడకయంచు బల్కుచున్"

వ. ఆ సమయంబున

గీ. ఆశ్రమమునిచ్చు శబరి కత్యధికమైన
కరుణ, జ్ఞానమ్ము నొసగును ఘనుడు మహాని
వర్యుఁడాతండ టంచును బలుకురీతి
చంద్రుఁడప్పుడు వెన్నెలల్ జల్లసాగె. 8

క. హాయిగ నా వెన్నెల కం
దోయికి నింపెసగఁజేయ దొంగనుబట్టన్
సాయమయి యొకరికొక్కరు
"మాయముగాకుండ చూడుమా"యని వారున్. 9

వ. సైగలచే తమ యభిప్రాయము నొండొరులకుఁ దెలియఁజేసి.

ఉ. చెట్టుల చాటులందు వెసజేరియు నోళ్లను బిగ్గబట్టి, యా
గుట్టు నెఱుంగు పూన్కి పెనుకొమ్మలకెక్కఁగఁజూచు నంతలోఁ
బెట్టుచు దర్భమోపులను వేగమె మానుల యిండ్లయొద్దఁ, గ
న్పట్టగ నామె యందఱు శబాసని మోదమునంది రయ్యెడన్.

గీ. ఎట్లుమాట్లాడ వలెనొ వారెఱుగరైరి
బాలురాటను, కొక్కిరి వాఁడొకండు
పలికె నీరీతిగా చాలభయము పడెడి
యామె యెదుటకువచ్చి యన్యాయముగను. 11

క. చెప్పిరి మా గురుదేవులు
తప్పక నిన్బట్టి యిపుడె తన సన్నిధికిన్
యెప్పగిది నేని తెమ్మని
చప్పున రావమ్మ యింత జాగేలనొకో. 12

వ. అంత నామెయు భయముచేఁ గుత్తుక తడియార, గజగజ వణకుచు, కరంబులు జోడించి సన్నని యెలుంగున నీ విధంబుగా నుడివె.

క. దండము మీా పదములకే
నుండనుగా యింక నిచట నొండొక యెడకున్
కుండయు మండయు దీసుక
నొండాడకఁబోదు చెప్పు డొజ్జకు మీారల్. 13

ఆ. వె చిన్నియయ్యలార ! చెప్పెద నొకమాట
నా మొరాలకించి నాయమెంచి
నాదు తప్పుగాచి నమకృపఁ జూడుడీ
యనుచు విన్నవింప వినక వారు. 14

గీ. గురునిచెంతకు దోడ్కొని యరిగి యపుడు
వందనంబయ్య గురుదేవ! పట్టుకొంటి
మీామె నిప్పుడు, మాట్లాడు నేమొ, యేమొ
దాని యర్థం బదేమిటో కానలేము. 15

వ. అని తన శిష్యులు వచించిన.

గీ. భయము మూర్తీభవించిన పగిదిఁ దనదు
నెదుటనే నిల్చియున్న యా యింతిగాంచి
మనము కరుణారసంబులో మునుగుచుండఁ
బలికె నా మహానివయ్యెఁడా పడతితోడ. 16

ఆ. వె. నల్లతాయిగూడ నవనీతమును బోలె
కరగిపోవు నామె గాధవిన్న
పుట్టినిల్లు కృపకు పెట్టనికోట, యా
తపసివరుని మనము దయను గనదె! 17

ఆ. వె. "వెఱ్ఱితల్లి! నీవు వేకువనే లేచి
యెందు కిట్లుజేతు వేమి కార్య"
మనుచుఁ బల్కుచున్న ఘనుని విలోకించి
భయము కొంతఁబోవ పలికె నామె. 18

గీ. నన్నురక్షింపుడయ్య నాపన్నురాల
నధమజాతిని బుట్టిన యట్టిదాన

పుణ్యమార్గంబ దెట్టిదో పోల్పలేని
చాల పాపాత్మురాలను శరణు శరణు. 19

వ. తండ్రీ, నాగోడాలకింపుము. అయ్యా! నేను చిన్నతనంబు నుండియు మంచిమార్గములో సంచరింప వలయునని.

క. చేసితినూహాల నెన్నియొ
గాసిలితిని, పొంది తేను కష్టము లెపుడున్
నీసరివా రెవ్వారలు
భూసురకులవర్య! దయను బ్రోవుము నన్నున్. 20

చ. ఎదుటనునిల్చి పల్కుటకు నేనియు నోచనిజాతిదాన, నా
మది కడుకల్మషంబు కనుమా భవదీయ కృపార్ద్రదృష్టి, నీ
పదములె దిక్కునాకు గనుపట్టుటలేదిక వేరుమార్గ మా
పదలను బొందియున్న ననుపాలనఁజేయఁగదయ్య మ్రొక్కెదన్.

చ. అని మొర వెట్టు, మాటికిని హస్తములౌదలఁ జేర్చు, నన్ దయన్
గనుమని వేడు, నీకృపనుగాంచిన నాకిక లోటులేదు, నా
జననము సార్థకమ్మగును, జ్ఞానమొకించుక నాకునిచ్చి, నా
మనము పవిత్రమాగతిని మార్చుమటంచును గోరు నాతనిన్.

చ. భయమును బొందకమ్మ నిరపాయముగా నిటనుండుమమ్మ, నె
మ్మెయి నెటలోటురాదు వినుమీ, నిను నెప్పుడుపీడ, సంఘుమే

మయినను, నన్ను జూచి కడుహాస్యమొనర్చినఁగూడ నింకనే
నయము నెచేతునమ్మ, ననునమ్మిన వారినిఁ బ్రోతునమ్మరో.

చ. అనగనుబల్కునాపె, వినయమ్ము భయమ్మునుగూడ నేకమై
దనరుచునుండ, నశ్రుజలధారలు గాల్వలుగట్టుచుండ, నె
మ్మనమున కొంచెమేని యనుమానము లేక, మునీశుతోడ, నన్
గనుగొనుమయ్య నీదయనుగాంచిన వారికి లోటుఁగల్గునే. 24

వ. అంత నామతంగుండు నామెకు భక్తిమార్గంబుపదేశించు
తలంపున.

ఆ. వె. బిడ్డ నీవు సుంత బిడియంబు పడకుండ
వినుము బోధ, జ్ఞానధనము గనుము
ధర్మనిరతినీవు కర్మంబులన్ జేసి
మంచిమార్గమునను మనగదమ్మ. 25

ఆ. వె. స్మరణజేయు మెపుడు సకలేశునామంబు
నఘములన్నిఁ ద్రుంచి యలరుచుండు
మహిమఁగలదిఁగాన, మాధవు భజనంబు
చిత్తశుద్ధి గలిగి చేయుమమ్మ. 26

తే. గీ. రామనామంబు పేరిటి రత్న మెపుడు
చీరకొంగున ముడివైచి, చేరనీకు
మెవరినింగాని ప్రక్కకు నెపుడుగూడ
దానిఁ జూపింపకమ్మ యందఱకు నీవు. 27

తే. గీ. పెట్టకమ్మ బజారులో, వెలయదింత
యంచుఁ జెప్పకుమమ్మ, నీ మంచితనమె
నిన్ను నడిపించు నెప్పుడా నీరజాక్షు
కృపనుగనె దీవు తప్పక నిపుణమతిని. 28

తే. గీ. తల్లియును దండ్రి యతఁడెగా దైవమతఁడె
భర్తయునుగూడ నాతఁడే, పాలనంబు
చేయువా డాతఁడేనమ్మ, చేయు మేలు,
నమ్ము మాతని మది సందియమ్ము మాని. 29

తే. గీ. ఆ మహామహు నర్చించు ననఘమతుల
నెవ్వరును గోపదృష్టి నొకింతఁగూడ
కష్టబెట్టగలేరమ్మ కాన నీవు
మనుము మాధవు దలచుచు గనుము శాంతి. 30

తే. గీ. నామమే దీర్చు కోర్కెల నమ్మియున్న
నామమే జ్ఞానమిచ్చు, నా నామధనమె
సర్వలోకేశ్వరుని దెచ్చి సరస నిలుపు
నామ మహిమంబుఁ జెప్పఁగా నాతరంబె? 31

తే. గీ. పట్టి బంధింపు మాతని పదము లెపుడు
నీదు మనమున గట్టిగా, వాదబుద్ధి
వదలి, గన్గొందు వాతని మదిని నన్య
చింతనంబును మానిన యంతలోనె. 32

ఆ. వె. నీవె దిక్కటంచు నే నమ్మియున్నాను
శరణమంటి నన్ను సాకుమయ్య
వేరెలేదు నాకు దారియంచును వాని
పాదపద్మములను బట్టుకొనుము. 33

చ. నిజముగ నె జెప్పుమమ్మ, విను నెమ్మదిచింతను మానుమమ్మ, యే
గజిబిజి నొందకమ్మ నిను గన్గొని యెవ్వరెటుల్ వచించినన్
భజనము మానకమ్మ, భవబంధములన్విడనాడ కెన్ని యో
సృజనలు జేయుచున్న మదిశేయుము చక్కగ నిశ్చలంబుగా.

తే. గీ. మనము నిర్మలమయినంత మమత లుడుగు
గలుగు నేకాగ్రబుద్ధియు, గాంచె దీవు
జ్ఞానరత్నంబు దాన నీ జన్మముననె
వినుము నామాట నిది నమ్మి మనగదమ్మ. 35

వ. అంత నా శబరి కన్నులనుండి కారు నీరు సజీవ స్రవంతుల వలె ప్రవహించుచుండ.

క. అయ్యా ! కడు నీచను నే
నెయ్యంబున మీరు జెప్పు నీతుల వింటిన్
కయ్యానికి కాల్ద్రివ్వెను
రయ్యా మా జాతివార లందఱు గూడన్. 36

చ. జగడమునాడగా నిటకు చయ్యనవచ్చెదరేమొ! యెంతయున్
రగడ జరుంగునేమొ ? నను రవ్వలఁ బెట్టెదరేమొ ? వారికిన్
బగకడు హెచ్చు, త్రాచులటు, పాపమటంచుఁ దలంపఁబోరు, నీ
దగు హితబోధ వారి హృదయంబుల మార్పుము మంచి
త్రోవకున్. 37

క. ఎప్పుడు కొట్లాడుచు, దా
మెప్పు డబద్ధంబులాడి, యీశ్వర భీతిన్
దప్పుచు నుందురు వారలు.
తప్పునుమీ యనుచుఁ బలికెఁ దయగనుమయ్యా. 38

వ. అంత నా మతంగమహాముని యామెను కృపార్ద్రదృష్టి
నవలోకించి,

క. నీ నుడులన్నియు మంచివి
కానముగా నిన్నుబోలు కాంతను భువిలో
మానుము మనమున భయమును
బూనికతో దీనసేవ పుత్రీ ! యెపుడున్. 39

ఉ. చేయుచునుందునమ్మ, విను, జెప్పుచునుందును దానిగూర్చి యే
సాయమొనర్పువారలకు సామియు మెచ్చుఁ, దలంచిజూచినన్
న్యాయముగూడనమ్మ, యిదినమ్మెడువారల, మోక్షలక్ష్మి దా
బాయకఁగొల్చునమ్మ నిరపాయత నిచ్చుటనుండు మమ్మరో !

తే. గీ. బాధపడియెడు జీవితగాధఁ దడవి
మనమునం దేల ? నమ్ముమీ మహినిజూడు

మెందరున్నారొ. నీకన్న మందభాగ్య
లెన్నడును సౌఖ్యమనునదే సున్నయగుచు
(యెఱుగకుండ). 41

వ. కన్నతల్లీ! భయంబుఁ జెందవల్లదు. నా మాటవినుము. నీవదృష్టవంతురాలవు కనుకనే విషయ సుఖంబులందు విరక్తిగలిగి యిట్లేతెంచితివి. లేనియెడల నింత చిన్నతనము ననే వైరాగ్యంబేల వొడము? బిడ్డా! యెంత దయాభరిత హృదయవు! హింసాప్రధానంబగు హీనకులమునందు జన్మించియు కరుణాప్రపూరితస్వాంత వగుట మిక్కిలి చిత్రముగా నున్నది. అమ్మా, భగవంతుండనఁ నెచటనో లేడు. ప్రతినిత్యమును దీనుల రూపంబున మనయెదుటనే తిరుగుచున్నాడు. మానవసేవయే మాధవసేవయనుమాట జ్ఞప్తి యందుంచుకొనుము.

సీ. కన్నుకాలును లేక కడఁగండ్లపాలౌచు
బ్రతుకుచుండెడివారి బ్రతుకుఁజూచి
కొంపగోడును లేక గోలు గోలున నేడ్చి
కష్టముల్ బడువారిఁ గాంచుచుండి
పొట్టెడన్నమునకై ప్రతిగృహంబున కేగి
పలుపాట్లఁబడువారి పాట్లుగాంచి
తల్లిదండ్రులు లేక తల్లడిల్లుచునున్న
యనదలౌ వారల నరయుచుండి

తే. గీ. హృదయమందలి చింతనువదలి యింక
తృప్తిమదిఁబూని వేగనా దీనులకును
సేవజేయుట ధర్మంపుఁ ద్రోవగాని
మన పరిస్థితులంగాంచి జనదు వగవ. 42

ఆ. వె. ఎందుకింతచింత ! యేమిటో యెఱుగవు
చూడ రెండుకండ్లుఁగూడ లేని
ముసలితొక్కవాని మొగము గాంచియునైన
వంత మానినమ్మ వారిజాక్షుఁ. 43

తే. గీ. అస్థిపంజర విధమౌచు నాతఁడిపుడు
జ్వరముచే బాధబడుచుండె, జావయేని
యిచ్చువారలులేని యాబిచ్చగాని
పాట్లనరసియు మదిలోని వంతమాను. 44

ఆ. వె. వచ్చిరేని నీదువార లిచ్చోటకు
వారిగూడ మంచిదారి కిపుడు
త్రిప్పువాఁడనమ్మ దేవునితోడుగ
సంశయంబు మాని చక్కనగుము. 45

క. రామా రామా యనుమా
వేమారులు, నిన్నుగాచు విభుడని మదిలో
నా మహనీయుని నమ్ముము
సామజ వరదా యటంచుఁ జక్కగ నిపుడే. 46

తే. గీ. రామనామంబు నెప్పుడు ప్రేమతోడ
సంస్మరించిన పాపముల్ సమయునమ్మ
కాన నామాట లాలించి గాంచుమమ్మ
మోక్షసామ్రాజ్యలక్ష్మిని ముదముతోడ. 47

ఉ. అంతట నున్నవాఁడుగను నందఱ నొక్కవిధంబుగాఁగ, యీ
వింత నెఱుంగలేముగద, వేఱుగ జూడడు నీచునైన, ర
వ్వంతయు గోపముంచ డరివర్గమునైన సముద్ధరించు, నీ
వంతముమాని యా పతితపావను పాదము లాశ్రయింపుమా.

సీ. పలుకు మెప్పుడుగూడ పరమేశు నామంబు
నన్యంబుఁ బలుకకుమమ్మ నీవు
వినుచుండు మెప్పుడు వీనులవిందుగా
శ్రీరామనామంబు గారవమున
చేయుమెప్పుడుగూడ శ్రీహరి పూజను
భక్తి నీమదియందుఁ బాదుకొల్పి
రమ్మిచ్చుటకు నీవు రఘురాముఁ బొగడంగ
సందేహమును మాని చక్కనగుదు

ఆ. వె. విదియె మంచిదారి, యిదియె దేవుని జేర్ప
దగిన శక్తిగలది, ధర్మబుద్ధి
వదలకమ్మ నీవు, మదిని రామునిదలంప
వమ్మ యెపుడు, నమ్ముమమ్మ దీని 49

సీ. కాపాడినాడుగా గజరాజు ప్రాణంబు
పరుగెత్తుకొనివచ్చి కరుణతోడ
రక్షించినాడుగా రాక్షసునుండి ప్ర
హ్లాదబాలుని జనాహ్లాదముగను
వలువలిచ్చెనుగదా పడతి ద్రౌపది మాన
సంరక్షణార్థ మాసభను నాఁడు
మెచ్చియిచ్చెనుగదా సచ్చరిత్రతయొప్ప
ధ్రువకుమారునకు మేదురసుఖమ్ము

తే. గీ. తప్పకను నిన్ను గాపాడు తండ్రియతడు
దీనజనులను బ్రోచెడు దేవదేవుఁ
డాతని భజింతురమ్మ వేదాంతులయిన
యతఁడె దిక్కమ్మనీకు నాకందఱకును 50

తే. గీ. మూఢులంచును దలపడు, మోసగాండ్ర
టంచుఁజూడడు, నీచులంబెంచబోడు
కరుణతో నెల్లవారిని గాచునమ్మ
వాని నమ్ముము నీమది వంతమాని 51

తే. గీ. తల్లియై బ్రోచు, తండ్రియై దయనుజూచు
గురువుపోలిక సద్బుద్ధిఁ గరపుచుండు
స్నేహితుని మాడ్కి మంచినిఁ జేయుచుండు
రామనామంబునకు సాటియేమిగలదు ? 52

తే. గీ. నమ్ము మాతని పాదపద్మమ్ము లెపుడు
నామమును సంస్మరించు మనారతంబు
నతనిరూపము ధ్యానించు మధికభక్తి
తప్పకను నిన్ను గాచు నా ధర్మమూర్తి. 53

తే. గీ. పఱుగు పఱుగున వచ్చును పరమకృపను
దీనజనులను రక్షింపఁబూని యతఁడు
నిమిషమాత్రంబుగూడను నిలువలేడు
భక్తులాతని దలచెడి పట్టులందు 54

క. పరమ దయానిధి యాతని
చరణములే దిక్కటంచు చక్కగ మదిలో
నిరతము గొల్చుచునుండిన
సరగునఁ డాఁబ్రోచునమ్మ శబరీ! యెపుడున్. 55

తే. గీ. పూర్వజన్మమ్మునను జేయు పుణ్యఫలము
నేడు గనవచ్చెనామెకు నేడుగడయు
దొరకె, జీవితమునకింక దొలగిపోయె
దుఃఖతమసంబు నంతలో దోచె తెల్వి. 56

గీ. నట్టనడి సంద్రమందున గొట్టుకొనుచు
నొడ్డు జేరగలేక దాను దధిముస్గ
బోవు నావను రక్షింపబోవు నెవడు?
సర్వమును గాచునట్టి యా స్వామిదక్క. 57

గీ. కష్టములలోన మునుగుచుఁ గనగలేక
శాంతి నొకయింతయేనియు, చాలఁ గుందు
చుండువారల మనముల నుండు బాధ
దొలగఁజేయగ గురునకు గలదు శక్తి. 58

వ. అంత నా శబరియు

ఉ. రామునినమ్మి నెమ్మదిని, రామునినామము నుచ్చరించు, శ్రీ
రామయటంచుబిల్చుఁ, గనురామమయంబుగ లోకమెల్ల,నీ
ధామములోన నాకుగలదా యొకయించుక చోటటంచు నా
రాముని వేడుచుండు, వెసరమ్మని బిల్చుచునుండు నాతనిన్.

తే. గీ. పరమపావని యామెకు కరుణతోడ
నాశ్రయ మొసంగి ప్రోచిన నామతంగ
మునిని గూర్చిన గుసగుసల్ వినగవచ్చె
పదుగు రొకచోటఁ గూడెడి పట్టులందు. 60

తే. గీ. మంచి పనులను జేసెడి మహితమతుల
చెడ్డపేరులఁ బిలచు నీ చెడుసమాజ
మునను సేవానిరూఢిని మనుచునుండు
ధన్యజీవుల కిక్కట్లు దప్పవెందు.

వ. ఆ పురంబులోనున్న స్త్రీలు నీలాటిరేవునం దీవిధంబుగా
ముచ్చటించుకొనఁ దొడంగిరి.

ఆ. వె. సోమిదేవి ! యెంత చోద్యంబొ చూచితే
నీచజాతి దాని నింటిలోనఁ
బెట్టినాడు దానిఁ బెద్దగాఁ జేసియు
వానిబుద్ధి యగ్నిలోనఁ బడెనె ? 62

ఆ. వె. ఎంత వెఱ్ఱివాఁడె, 'యెరుకులసానంట'
యిట్టిబుద్ధు లతని కెట్టులబ్బె ?
తపముఁబోదె యింక ధ్యానమ్ము మంటలోఁ
తగులఁబడదె ! యిట్టి మగువవలన. 63

వ. ఆ మాటలకు సోమిదేవమ్మయను నొక వృద్ధవనిత, యిట్లనియె.

ఉ. అంతటి మాటగూడ దతఁడట్టి మనంబుగలట్టి వాఁడుగా
డింతయెఱుంగమే, పరుల నీగతి నిందలనాడఁగూడదా
యింతివిధంబదెట్టిదియొ ! యెందుల కీయపవాదు, దీన పె
న్వంతలపాలుగారె సరివారలల్లో నవమానమాత్మచే. 64

తే. గీ. ఆమె మాటలు వినుచున్న యతివయొక తె
మూతియడ్డంబుగాఁద్రిప్పి ముక్కుమీఁద
వ్రేలుబెట్టుక నెంతయో హేళనగను
బకపకానవ్వి యిట్లని బలుకసాగె. 65

మ. అహహా! యెంతటి ముద్దరాలితనమే! యచ్చంబుగానాతఁడే
మహానీయుండని వాని పక్షముననే మాట్లాడుచున్నావు, యీా

మహిలో నెంతటి హానినైనను వెసన్ మైకంబులోఁ గూలడే
సహానంబుండునె టక్కులాంద్రఁగనినన్ సామాన్యసన్యాసికిన్.

శా. కానీ లేఘనుఁడాతఁడంచుమదిలో కాంక్షే మియున్ గొంచె మేన్
లేనే లేదని జెప్పుకొన్న, తనకున్ లేదే సదాచార మిం
కీ నీతుల్ వెసగట్టి పెట్టగదవే, యేమంచు భావించితో
వానిన్, టక్కరివాక్యముల్ వినుటచే, వాఁడంత సన్మార్గుడే!

ఆ. వె. అనుచు జెప్పుకొందు రమ్మలక్కలు, వారి
లోన వారు మనసులోనిమాట
నధికమైన వింతనందుచుఁ గుంపులు
గూడి యచ్చటచట పాడిఁ గనక. 68

వ. ఈవిధంబుగా కొందఱు జోయదనియు, మరికొందఱు
కోయిదనియు, కొందరు మాలదనియు నెవరికిదోచిన
విధంబున వారు చెప్పుకొనసాగిరి.

క. స్త్రీలేగాదా పల్లెను
చాలాఘనులైనయట్టి శాస్త్రులవారల్
మేలెంచనట్టి ముదుసలు
లేలాజేసెను మతంగుఁ డీ పని ననుచున్. 69

వ. ఆపల్లెలోనున్న శతవర్ష జీవులందఱేకమై.

క. అయ్యో శాస్త్రవిరుద్ధము
నెయ్యంబునఁ జెప్పవినడు నీతి విదూరం
బియ్యాగడం బదెట్లో గ
దయ్యా యేమంచు వాని నదలించెదమో. 70

తే. గీ. పెద్దలందఱు నాతనియొద్ద కరిగి
చిన్నవాడవు నీవు, నీ చిన్నబుద్ధి
వదలి, వేగమె వీడు మా వనిత నిపుడు
నీచవర్ణంపు దానితో నేస్తమేల ? 71

తే. గీ. అధమజాతికి సుజ్ఞాన మబ్బదయ్య
పిచ్చివాడవె ? నీవేమొ పేరుదెత్తు
వనుచు మురియుచు నుంటిమి మనములందు
నింతలో దబ్బరయిపోవు రెఱుగ మిట్లు. 72

చ. వినగదవయ్య మా పలుకు, వీడెదనంచను నాపెనిప్డు, నీ
మనమున నెంచి దీనియనుమానము మానుము,సంతసంబు వే
గనుము,శుభంబులొందెదవు,కాదనబోకుము మంచిదానునీ
కనయమటంచుఁ బల్కవినయమ్మున బల్కెమతంగుడప్పుడున్.

తే. గీ. ఎవ్వరునుగూడ లేరామె కెంతో పిచ్చి
పిల్ల, పాపము నుడువదు కల్లమాట
లెల్లవేళల దేవునే యుల్లమందు
దలచుచుండును విడువదు ధర్మపథము. 74

ఆ. వె. నీకు జెప్పువాడ నీతివాక్యముల
జ్ఞానమిచ్చువాడ చాల ననుచుఁ
జెప్పి నమ్మునట్లుజేసి, యిప్పుడు వీడ
నఘము నాకురాదె యనఘులార ! 75

తే. గీ. కష్టముల్ వచ్చిననుగూడఁ గనను భయము
నష్టమైనను భరియింప నడుముగట్టి
సిద్ధముగ నుంటినయ్య నన్ జేయ వెలిగ
నిశ్చయించిన నామాట నిలుపుకొందు. 76

చ. పతితుల నుద్ధరించుటయె పావనమౌ పనిగాని వారి స
ద్గతుల నెఱుంగ లే కిటులఁ గల్పనఁజేయఁగ చెడ్డమాట లా
పతితజనావనుండు భగవంతుఁడు మెచ్చునె? స్వార్థమే సదా
మతి దలపోయ మంచిదగు మాటగ మీామనమందు దోచెనే.

తే. గీ. పతితులను బాగుజేయుటే పనిగ దలచి
వారి యింటను 'సేవను' వదల 'డతఁడు'
మనమె ! జనమచ్చటికిగూడఁ గనము కరుణ
మనమునందున నిది మంచి మాటయౌనె ? 78

తే. గీ. దీనజనబంధు 'డాతఁడు' దీనజనుల
వేడి నిట్టూర్పు రూపాన వేడుచుండె
మనమె ? పూజలు సల్పు చావనరుహోక్తు
పాడుచుందుము గొంతెత్తి భజనలందు. 79

తే. గీ. నడుముగట్టుక నిలబడి గడియ గడియ
కార్తజన రక్షణంబున కధికమైన
'జాలి' మదినుంచి వేగనే యేలుచుండు
'నతని' మెప్పింప సేవయే యధికమయ్య. 80

ఉ. జ్ఞానమునిచ్చి దీనులకు, చక్కని మార్గమునందు ద్రిప్పి, య
జ్ఞానము బార ద్రోలి భవసాగరమున్ దరియించు మార్గమున్
గానగజేయు టుత్తమముగాని, యొకించుక జాలిలేక, మీ
మానసమందు, నిట్లు పలుమారులు వల్కగ మేలె? చూడుడీ.

ఉ. పెద్దలమాటయున్, బెనుగు వేసిన యన్నపుమాట నెప్పుడున్
వద్దనగూడదన్న నుడి పాడియెగాని, మదీయ ప్రార్థనన్
బెద్దలు మీరలోర్చి విని, పెంపు వహింపగఁజేయుఁడయ్య, మీ
సుద్దులుమాని ధర్మమును సుంతదలంపుడు భూసురాగ్రణుల్.

చ. ననుశమియింపుడయ్య, యికనాదగు విన్నపమాలకించి, మీ
మనముల ప్రేమనుంచి యభిమానము నావలద్రోచి, దీనులన్
గనికరమొప్పఁగాచుటయెగౌరవమంచుఁదలంచుచుండియున్
మనుటయెయుత్తమంబయినమార్గమటంచెప్పుడాత్మనెంచుడీ.

తే. గీ. మనసుఖంబున మనమేలు మనముముక్తి
బడయు మార్గముఁజూచుచుఁ బ్రతుకుచుంట
మంచిమార్గమొ? పతితుల మధ్యకరిగి
జ్ఞానమిచ్చుట మంచిదో గానలేరె? 84

చ. పరులకు సేవ జేయుటయె, పావనమాపనియంచు, వారినిన్
గరుణయొకింతలేక కడగండ్లనుద్రోసిన పాపమంచు ము
న్నెఱుఁగఁగఁ జేయ వేఁ శ్రుతుల దేటికియింతటి చర్చమీకు, మీ
చరణములానసుండు తమ సన్నిధిఁజెప్పెడి పాటివాడనే. 85

తే. గీ. అంత నా వృద్ధులంద రత్యధిక మైన
కోపమునబల్కి రీతని పాపమనక
వెలినిఁబెట్టగ వదలు నీవెఱ్ఱియిపుడె
యనుచు నిశ్చయమును జేసుకొనినగూడ. 86

ఆ. వె. కొంచెమేని భయముగాంచడు మనమున
కష్టవనధి పిల్లకాల్వఁబోలె
దాటగలుగునట్టి ధైర్యంబుగలవాఁడు
మానివర్యుఁడతని మహిమయేమొ? 97

తే. గీ. ఆపురంబున నున్నట్టి యవనిసురులు
కట్టుగట్టియు వెలిఁజేయ గట్టిగాను
ధర్మమార్గము వీడని తలపుగలిగి
సర్వజీవుల నొకరీతి సాకుచుండు 88

వ. ఇట్లామతంగుండు పతితుల యిండ్లకేగుచు, వారి కష్ట సుఖంబుల కాధారమై, యామహా పవిత్ర కార్యంబులో శబరిగూడ దన్ననుసరింప దీనజనసేవ జేయుచుండ నాతనికి బ్రహ్మైక్యకాలము డగ్గరె. అంత నామహాను భావుండు పరమభక్తురాలగు శబరిం బిలచి యిట్లనియె.

---

## గురుగుప్తి

సీ. వెడలుచుంటిని నేను విశ్వరూపుని జేర
నాదు మాటలు నమ్మి, వాదబుద్ధి
వదలి, కుమ్మరిపురుగ్వ పంకమంటని రీతి
వసియింపు మీా భవ వనధియందు
భయములేదని బల్కి పరమపావనమైన
హస్తంబునుంచి దామస్తకమున
మోక్షసామ్రాజ్యంబుఁ బొందుమార్గము వీడ
కెపుడుగూడను నీవు నిపుణమతిని

తే. గీ. మనుము శ్రీరాము రాకను మదిదలంచి
గనుము సర్వజ్ఞు కన్నులఁ గరవుదీర
జనుము నేజెప్పినట్టి యాచాయ నెపుడు
వినుము నామాట నమ్మము మనమునందు. 1

వ. వైకుంఠ వాసుడైన శ్రీమహావిష్ణువు, భూభారహరణార్థంబై శ్రీరాముడనుపేర దశరథనందనుండై జన్మించి తండ్రియాజ్ఞ వలన.

ఉ. వచ్చును తప్పకీ వనికి, వచ్చును నీదు కుటీర భూమి కీ
విచ్చిన మంచిపండ్లు మది కింపెసగంగ భుజించునమ్మ, యే
హెచ్చును తగ్గులేక మది హెచ్చిన నక్కటికంబు గల్గి, దా
నిచ్చునుమోక్షసౌఖ్యమిదియెప్పుడునమ్ము మనంబులోపలన్.

చ. జపములు జేసినైన, మరిజన్మము లెన్నొ నరించినైన, బల్
తపములు సల్పినైన, మదిదాంభికవృత్తిని మానకున్న, నా
నిపుణుని జెందలేము, కడు నిర్మల చిత్తమునందు భక్తితో
నెపుడు దలంచువారి గను నెప్పు డతండిది సత్యమమ్మరో. 3

ఉ. అందునగూడ నున్నదొక యర్థము ప్రేమనొసంగు భక్తితో
నెందున లేదుసాటి, గను మెవ్వరు దానికి నడ్డుపెట్టరే
మందును దాని సన్మహిమ నందితివింక భయంబుఁగాన మీ
చందము మంచిదమ్మ విను చక్కఁగ నావచనంబు లమ్మరో. 4

ఉ. ఎంతయు నమ్మినావు మది నెప్పుడు నాతని నామరత్నమే
చింతనఁ జేయుచుంటి వది చేయక పోదిక మేలునీకు, నీ
చెంతకువచ్చు, నిన్నుదయ 'సేమమె' యంచును బల్కరించు నీ
వంతను మానుమమ్మ,సురవంద్యునిఁ జూచెదవీవు తల్లిరో. 5

తే. గీ. దీనజనసేవ నెప్పుడు మానకమ్మ
వారిసుఖమునకై పాటుబడగదమ్మ
మంచిదారిని నడచుచు మనగదమ్మ
కమలలోచనుదయ నీవుగాంతువమ్మ. 6

ఆ. వె. అనుచు జెప్పి యాతడరిగెను వైకుంఠ
మునకు, దేవగణము ఘనతతోడ
స్వాగతమ్మునిచ్చి సంతసంబందుచు
చదల నిలచి జయము జయమనంగ. 7

తే. గీ. అంత నాభిల్లవనిత యత్యధికముగను
గురుమహాత్మ్ముని దలచుచు, మరపులేని
దుఃఖజలనిధి మున్గెను, దోఁచదయ్యె
పాపమామెకు వేరొక్క పథముగూడ. 8

చ. అరిగితివీవు జన్మమరణాది భయంకరదుఃఖ పూర్ణమై
బరగు ప్రపంచమున్ విడిచి, వంతనుబొందుట పాడిగాదు నా
కరయ, భవాగ్నితప్త హృదయాబ్ధికి శాంతినొసంగు వార లీ
ధరనిక లేరు యేరనుచుఁ, దల్లడమొందెద సద్గురూత్తమా. 9

సీ. వీడితే శిష్యుల వెతల పాలొనరించి
దయనొకించుక యేని దలపకిపుడు
వెడలితే దేవాళి వీనులవిందుగా
ముక్తిమార్గంబనురక్తి దెలుప
మరచితే భవవార్ధి మగ్నులమైయున్న
మామాట కరుణయన్ మాటలేక
జేరితే సురనరసిద్ధ సేవ్యంబైన
సరసీరుహాక్షుని చరణయుగము

తే. గీ. దీనురాలను దిక్కేమిలేనిదాన
మందభాగ్యను నన్నిట్లుమహిని విడచి
పరమపదమును జెందితే గురువరేణ్యా
యెవరుఁబ్రోచెదరింక నాకేదిదారి. 10

వ. ఇట్టులామె దురంత చింతా(క్రాంతచిత్తయయ్యును, గురూప
దేశ మార్గంబుఁ దప్పక యథాశక్తి దీనజనసేవ సేయుచు,
సకల (ప్రపంచంబు (శీరామమయంబుగాఁ దలంచుచుండె.

తే. గీ. అన్నమని యెవ్వరైనఁ దన్నడిగిరేని
తను భుజింపక వారిని దినుడటంచు
నింటిలోనున్న యాహార మింతయైన
మిగులకుండగ నిచ్చు నా మగువ మిన్న. 11

తే. గీ. ఇచ్చి రామున కిచ్చితి నిపుడు నేను
భాగ్యశాలిని, నాపాటి వారుగలరె!
యనుచు నానంద వనధిలో మునుగుచుండు
పరమపావని యాభక్తి భరితహృదయ. 12

తే. గీ. రామరామ యటంచు నా రామవిభుని
మనమునందునఁ దలఁచును మఱపులేక
నఖిలమును రామమయముగా నరయుచుండుఁ
బరమపావనియైన యా పడతి మిన్న. 13

సీ. తినగ నన్నములేకఁ దిరుగుచుండెడివారి
కాహార మిడి తృప్తి నందుచుండి
తల్లిదం(డులు లేక దల్లడిల్లుచునున్న
యనదలౌ వారల నాదరించి
దుఃఖార్ణవంబునఁ దూలెడు వారికిఁ
జల్లని మాటల శాంతినిచ్చి
రోగుల సేవను బాగుగాఁ జేయుచు
ధైర్యంబుఁ గరపుచుఁ దనరుచుండి

తే. గీ. యీశుపూజను జేసితి నిపు డటంచు
ముదము నొందుచునుండు నా సదయహృదయ
గురుమహాత్ముని వాక్యముల్ మరపు లేక
మనన మొనరించు మనమున ననుదినంబు. 14

గీ. ఇట్టులా భాగ్యశాలిని యెంతయేని
కరుణతోడుతఁ దీనులఁగాఁచుచుండి
పెద్దలందున కడుభక్తి వెలయ, జీవి
తమ్ముఁగడపుచు నుండఁగా తపసివరులు. 15

తే. గీ. చాలగర్వంబు హెచ్చి నీచానకనుచు
తరిమివైచిరి ధర్మముఁ దలపకపుడు
కొంచెమైనను భయమును గాంచదయ్యె,
నంతయును రామమయముగా నరయుచుంట. 16

వ. ఆయూరిలోనున్న వారలకు శబరియన్న మొదటినుండియు క్రోధంబుగలదు. అయ్యది యాపల్లెలో జరిగిన యొకానొక విషయంబుచే మరింత వృద్ధినొందె. ఆయుదంతం బెట్టిదనిన.

తే. గీ. ఆపురంబున నున్నట్టి యవనిసురుల
లోనమేల్బంతి, గర్వములేనివాడు
భక్తిమార్గమునం దనురక్తిగలిగి
తలఁచు నాశ్రీశు పదములే తనదుమదిని. 17

వ. ఆభూసురునకు లేక లేక యొక బిడ్డవొడమిన, దాని నాతండు గారాబంబుతోఁ బెంచుచున్నంత భార్యావియోగంబు తటస్థించె. దాని కతఁడు లెక్కసేయక నాపసికూనం బెంచి, యష్టమవర్షంబున వివాహంబు గావించిన, నాకన్నె జాతక ప్రభావం బెట్టిదియోగాని యావరుండుగూడ స్వర్గస్థుండయ్యె, నంత.

తే. గీ. కష్టవనధిని మునిగియు నిష్టదైవ
తంబు పూజను సలిపి యా ధరణిసురుడు
హృదయమందున భాధను పదిలపరచి
ప్రేమతో సాకె తన ముద్దుబిడ్డనపుడు. 18

తే. గీ. ఇట్టులారేండ్లు గడవ నదేమిపాప
ఫలితమోగాని, తండ్రియుఁ గలసిపోయెఁ
గాలగర్భంబులోన నా కన్నెకపుడు
కలరె నెమ్మిని గాపాడఁ గలుగువారు. 19

క. తన పాపమె పెనుబామై
తన తలిదండ్రులను తనదు దయితుని గూడన్
కనికర ముంచక మ్రింగిన
మనగలదే యామె శాంతి మనమున నింకన్. 20

తే. గీ. దిక్కులేనట్టి యామెదా దిక్కు నెవరుఁ
గాంచుటకుగూడ మదిలోన నెంచరైరి

చాల పాపాత్ములరా లీమె ఛాయగూడ
నాపదలపాలుఁ జేయు మమ్మనుచువారు. 21

వ. సంతతాశ్రుధారా పరిప్లావితవదనాంభోజయు, నిర్భాగ్యయు నైన యామెంగాంచి, కరుణ యను మాటలేని యీ సమాజంబు నేమనవలె? ఇట్టు లామె దుఃఖసంతప్తయై కాలంబు గడపుచుండ నొక్కదినంబున పరమపావనియైన శబరి యామెంజూచి జాలినొంది యారేయి నామె యింటికింజని దుఃఖోపశమనంబు గావింపఁ దలంచె నంత,

చ. మనమున నెంచిచూచి యనుమానము లేకి సుమంతగూడ, వే దనఁబడు నామె దగ్గరకు ధర్మము పోవుటయంచు నెంచి, తాఁ జనెను నిజాశ్రమంబునకుఁ జయ్యనసూర్యుఁడు పశ్చిమాబ్ధిలో మునిగని కేమిచేయు, విధి మోసముఁ జేయదెయెంతవారినిన్.

శా. కాంతిన్బాసెను లోకమెల్ల, 'కలువల్ గాంచున్ ముదంబిప్డు తా మెంతో యిందునిరాకగాంచి, కనరాడింకన్ మదీయాప్తుడు న్నెంతో వంతలగుందు చీపగిది మేమేమంచు జీవింతు' మం చంతన్ వ్రాల్చెనుగా శిరంబులను దామంభోజసంఘంబులున్.

ఉ. నాథుఁడు లేనిచోఁ గనెడు నాయకుఁడెవ్వడు? వారి దుఃఖపున్ గాథలు విన్నరాల్గరుగుఁగాని, జనంబులు చుల్కఁజేసి బేల్ బాధలఁ బెట్టుచుందు రికఁ బాడి దలంపరు, జీవితంబులో నాదరు వుండఁబోదుకద! యామెకు నంతయు చీకటేగదా.

తే. గీ. అనుచు రీతిని క్రమముగాఁ దనదు రాజ్య
మునను గర్వించి, యితరుల కన్నులుగప్పి
విందు వేడుక గొలువుండి నేనె గొప్ప
దాన నంచును గర్వించెఁ దమము వించి. 25

ఉ. జీవితనాయకుండు సన జీవితమెల్ల వృథాయటంచు, నా
భావి యదేమొయంచు పలుభంగుల భావనఁజేయనేల, సం
భావనఁజేయు మాపరమ పావనుపాదము లంచు దెల్పు నా
శ్రీవను, జ్ఞానచక్షులనఁ దోఁచె నభంబున జుక్కలంతలో.

తే. గీ. సంసరణ సాగరంబులోఁ జాలఁ గుంద
నేల, సుఖమంచుఁ దలపఁగా నేల, యింక
నీశు నామము దలపుడీ యెపుడుగూడ
దానిమహిమను జెప్పనాతరముగాదు. 27

ఆ. వె. అనుచు దెల్పు నట్లనంత తేజోరాశి
చంద్రబింబ మపుడు చదలఁదోఁచె
తేటగాను తెలియు తెల్విగాంచిన మీద
టన్న రీతి వెన్నె లధిక మయ్యె. 28

తే. గీ. దుఃఖితుల దుఃఖరాశిని దొలగజేయ
జ్ఞానమునకన్నఁ గలదె? యీజగతియందు
చింతయను చీకటిన్ బడునంతలోన
వెలుగురాకున్నె వెన్నెల విధముగాను. 29

వ. ఇట్లు చింతాభరిత స్వాంతయైన బ్రాహ్మణ కన్యకకుఁగూడ భక్తియను వెలుగుఁ బ్రసాదించిన, యామె జీవితంబులోని చీకటి తొలఁగిపోవునని ప్రకృతిమాత యుపదేశించుచుండ, నాశబరి, యామె యింటికింజని యామెరత్నం బామె కొంగునంగట్టి దన్మహిమం జెరుకపరచి, భయములేదని పల్కుచుండఁ గొందఱు బ్రాహ్మణులు దానింగాంచి యీ నీచకులంపుదానికి గర్వము హెచ్చెనని దూరంబుగాఁ దఱిమి వైచిరి. అప్పుడామెభయంబుఁజెందక యాయరణ్యమధ్యంబున నొక కుటీరంబు నిర్మించుకొని సదా శ్రీరామచంద్రుని ధ్యానించుచుండఁ గాలక్రమంబున నామెకు వృద్ధత్వంబు సంప్రాప్తించె.

తే. గీ. హృదయమందున ధ్యానము నెపుడుఁజేయు,
నామెకెదుటనె యున్నట్లు రామచంద్ర
మూర్తి తోచుటవలన, నామోహనాంగు
కాళ్ల నెప్పుడుఁ గన్నీటఁ గడుగుచుండు. 30

తే. గీ. అంతలోపల స్మృతిరాగ నధికమైన
వంత, రాఘువరామ ! యీ పంతమేల
నెచటి కేగితివయ్య ! నీ వింతలోనె
దీనురాలను నన్వీడి కానలందు 31

తే. గీ. ఎదుట నున్నట్లు గన్పించి, మదికి సంత
సంబుఁ జేకూర్చి, యిటులేల సల్పుదయ్య !

ధర్మమా! యిద్ది నీకు భూదయిత! శౌరి!
ఆటలాడుదె? నాబోటి యనదతోఁడ? 32

క. కరుణాభరణా! నతజన
శరణా! సుజనైకతరణ! సారసనయనా!
ధరణీ తనయా రమణా!
సరసీరుహచరణ! నన్ను సాకుము, దేవా! 33

క. రారా రాఘువరామా!
రారా సుర వినుత నామ! రాక్షసభీమా
రారా రవికుల సోమా!
రారా సాకేతధామ! రారా రామా. 34

క. సరసీరుహనిభనేత్రా!
ధరణీతనయా కళత్ర! దశరథపుత్రా!
కరుణాపూరితనేత్రా!
సురనాయక వినుతిపాత్ర! సుందరగాత్రా! 35

క. మురహర, భవహర, నరవర
సురవరనుత చరణకమల, సురుచిర లీలా!
శరణను నను నరయఁగదే
నిరవధిక సుఖప్రదాత, నిఖలత్రాతా. 36

క. వేదండరక్ష ! వేగమె
నీదండను జేర్చికావు నీరజనేత్రా !
యేదండ లేదు గదరా
కోదండము దాల్చునట్టి కోసలరామా ! 37

క. ఏలా ? యింతటి కోపము
మేలా ? యిటు లూరకుంట, మృదులహృదయ ! శ్రీ
లోలా ! ప్రోవవె, దశరథ
బాలా ! నతలోకపాల ! పరమసుశీలా ! 38

సీ. ఏటికీకోపము మాటలాడవు దేవ !
పాటిదప్పెనె కీర్తి తాటకహర !
వేడుకా ? నిన్నిటు నేఁడు నన్వీడనాడ
పాడియా వేగఁ గాపాడుమయ్య !
రక్షించవా కరిన్, శిక్షించి మకరిని
తక్షణంబె నీవు పక్షివాహ !
ధర్మమా యిదినాదు కర్మమా యింతటి
మర్మమా నీకునో నిర్మలాత్మ !

తే. గీ. జాలమేలను సామి ! నీ పాలఁబడితి
మేలమా ! దీనజనముల నేలునప్పు
డేల యీలీల సలిపెదో ? నీలవర్ణ !
చాలుఁ జాలును కోపంబు చాలునయ్య. 39

సీ. నీరాకకై చూడ ధారాధరాకార !
నేరాల నెన్న దే మేఱదప్పి
శ్రీరామ ! కరిరాజు మారాముఁ జేయంగ
గారాముతోఁ గావవే ? రమేశ !
వారాశిగంభీర ! ధీరా ! శుభాకార !
నారాయణా ! హరీ ! మారజనక !
ఏరా ? దయన్ జూడవేరా ? కృపాంభోధి
ధారాభిషిక్తార్త తరణ తరణి !

తే. గీ. నరవరాకార ! జానకీ వర ! బిరాన
నరుగుదెంచియు నాపాటు లరయుమయ్య
మొఱుగను గదయ్య ! వేరొక్క తెఱవు నేను
సురలఁగాచెడుఱేడ ! నిన్ మఱువనయ్య. 40

క. వలదా ! నాయాతిథ్యము
కలదా ! నీయాత్మనింత కాఠిన్యంబీ
వలదా ! భక్తుల కీప్సిత
ఫలదాన మనంతలోకపాలక ! రామా !. 41

శా. శ్రీరామా హృదయాంబుజగ్రహపతీ! శ్రీరామచంద్రాకృతీ!
కారుణ్యాభయదాన నిమ్నగపతీ ! క్రవ్యాద కాలాకృతీ
సూరార్యాన్వయవారిధి ద్విజపతీ ! సూర్యేందునేత్రాకృతీ !
చేరన్ వచ్చియు బ్రోవరా రఘుపతీ ! సీతామనోజాకృతీ !

సీ. తడవాయెనేలరా ! గడియలోననె వచ్చ
నోడయడ వీవని నుడువు శ్రుతులు
కడుదయన్ జూచి నా గడపలోనికి నడ్గు
నిడ వేడితిని దప్పఁ దడవవలదు
యెడబాటు కోర్వరా ! పుడమిాశ్వరా ! నాదు
నెడదలో నీభక్తి సడలనీకు
పడెదరా! దేవ ! నీ యడుగులపైన నా
జడుపుఁ దీర్పఁగ నగపడ వదేల !

గీ. చూడరా ! నన్నుఁ గాపాడ వేడితినిర
తోఁడునీడయి యుండెడువాఁడ వీవె
నాఁడు భక్తుల సిగపూవు వాడకుండ
నేఁడు గడయైనయట్టి బల్ ప్రోడవీవె. 43

సీ. లేదుగా నీదయ రాదుగా నామిాద
మాధవా ! యిది నీతి గాదుగదర !
నీదాసఁగానో మరేదారిఁ బోదునో
యోదానవాంతకా ! యాదిదేవ !
వాదాయె నేలరా ? పోదా చలంబుమా
నాధార్చితా ! రమానాధ ! శౌరి !
యేదిరా ! తండ్రి నీ పాదారవిందంబ
నాధనాధా ! దేవ ! సాధురక్ష !

గీ. కదలకుము నీవు నిలిచి నా హృదయమందు
వదలకుము నాదు చెయిఁబట్టి సదయహృదయ !
మెదలకుండఁగ బంధింతు నిది నిజమ్ము
కదర ! నాసామి ! యసురేశ మదవిదారి ! 44

ఉ. చీమచిటుక్కుమన్న యత సీకుసుమాభుడు వచ్చెనంచు, దా
నేమొతలంచి, సత్వరమె యేగును గుమ్మమువైపు, నీరద
శ్యామలదేహు కట్టెదుట నారయజాలక తిర్గివచ్చి, యో
రామ!దయారసంబిపుడు రాదొకొ?నాపయినంచుఁజింతిలున్

తే. గీ. కన్నులనుమూసి నిద్రను గాంచునప్పు
డులికిపడిలేచి, నేనెంత తెలివిమాలి
నిద్రఁబోయితి, శ్రీరామభద్రుఁ డిప్పు
డిచటికేతెంచి వెడలెనో యేమొయనుచు. 46

ఉ. ఎంతటిపాపినైతి ! నిక నేగతి జానకిరామ ! నాకు, నా
చెంతలకెప్డు వచ్చెదవు, చేయుదు సత్కృతినెప్డు నీకు, ర
వ్వంత యనుగ్రహంబునుపమా యిదె వచ్చుచునుంటి
నంచుఁ దా
నెంతయుఁజింతతో వెడలి యెవ్వరు నచ్చటలేక యుంటచే.47

తే. గీ. ఘననిరాశను గూలును, కనులమీద
కోపగించును, మీరేల తేపఁదేప
కిట్లు మూతనుబడుదురే నెట్టులింక
నామహామహు మూర్తిని నరయుదాన. 48

వ. అని తలంచుచు

క. దేవా ! యెచ్చటికేగెదు
రావా ! యిటులొక్కసారి రామా ! దయతో
కావా నిఖిలాత్ముఁడవీ,
వీవా మునుభక్తవరుల కీప్సిత తతులన్. 49

క. నిన్నే నమ్మిన పాపము
లెన్నో కొల్లలఁగాని యెంతయు భీతిన్
మన్నై పోవునుగద ! యో
యన్నా ! మాటాడుమన్న ! యధికప్రీతిన్. 50

క. దశవిధరూప వినోదా
దశవరనుత పాదపద్మ ! దశరథ తనయా !
దశకంఠ కంఠలుంఠన !
దశదిగ్వినుత ప్రభావ ! దానవవైరీ. 51

వ. ఈవిధంబుగా నస్వరమపావని, యేశబ్దంబు విన్నను శ్రీరామ పద ధ్వనిగాఁ దలంచుచు, నేమాట విన్నను నా కరుణా వరుణాలయుని వచనంబులుగా నెంచుచు, నెవ్వరిని జూచిన, నా దేవాదిదేవునిగనే భావించుచు కాలంబుఁ గడపుచుండ నొక్క దినంబునఁ, కొందఱు బాలకులు

చ. జనకుని యాజ్ఞ, రాజ్యసుఖసంపదలన్ విడనాడి తమ్ముఁడున్
దన సతి వెంటరాఁగ, గుణధన్యుఁడు శ్రీరఘురామచంద్రుఁ డీ

వనమున కేగుదెంచె నిను పాలనసేయఁగ నంచుఁబల్కు, స
జ్జనసుతశీల యా శబరి సత్వరమే గుణధాముఁ బాడుచున్. 52

ఉ. అంతట సంతసంబు మనమందున హెచ్చఁగ, రామచంద్ర భూ
కాంతు పదాబ్జముల్ గనెడు కౌతుక మెక్కుడుగాఁగ, వేగ నా
చెంత నెయున్న వృక్షములఁ జేరఁగఁబోవుచు, వోరపండ్లఁదా
నెంతయు వేడ్కఁగోసియొకయించుక వాచవిఁజూచివానిలోన్.

తే. గీ. తియ్యనై నట్టి ఫలములఁ దెచ్చియుంచి
రామచంద్రున కిచ్చెద రాగలం డ
తండటంచును దలచుచుఁ దనదు మదిని
సంతసము నొందుచుండు నా యింతి యపుడు. 54

వ. ఈవిధంబుగాఁ దలపోయుచు నామె యొక్క దినంబున.

ఉ. వచ్చెనటంచు వింటిఁగద, వచ్చునె నాదు కుటీరభూమి కా
సచ్చరితుండు, సజ్జనుల సత్ఫలమా దనుజాళి పాలి కా
ర్చిచ్చగువాఁడు, వేగ నను జేకొనునే తన దాసిఁగాఁగ, నీ
బిచ్చకి యంత భాగ్యమది పెట్టియుఁబుట్టెనె? బమ్మదేవరా!

తే. గీ. రాడుగా యింక రాముండు రాడటంచు
ఘన నిరాశను గూలును మనమునందు
వచ్చునాతం డటంచును బలికె గురుడు
తప్పునా యద్ది యంచును దలచు మరల. 56

క. వచ్చును తప్పక వచ్చును
వచ్చును నాయింటి కిపుడు వచ్చు నతండున్
జెచ్చెర, కరుణానిధి తా
వచ్చునుగా ! దీనజనుల పజ్జకు దయతోన్. 57

తే. గీ. తియ్యగానున్న పండ్ల నాదేవునకును
బెట్టుకోరిక రుచిచూచి పెట్టినాను
గంపనిండుగఁ, గాని యా కమలనేత్రుఁ
జూడయేఁ గానుపింప దీచందమేమొ ? 58

ఆ. వె. అని తలంచుచున్న యామె మనంబులోఁ
దోచె నొక్కయూహ, త్రోవలోన
ముండ్లుగలవు రామమూర్తి పదంబుల
వెంతొ మృదువు లిప్పుడేమిసేతు. 59

వ. అనిదలంచుచు నామె యచ్చటికినేగి యాముండ్లనన్నింటిని.

ఉ. ఏరదొడంగె నెన్నియనిరోసెదను? తొంబదియేండ్లదాపె,యా
కారమొ ! యస్థిపంజర వికారముఁ చూడఁగ, నంతలోననే
మారెను భావమేమొ ! పలుమారులు దొర్లగసాగె నేలపై
"యేరిన చాలకాలమగు నింతట రాముడువచ్చునేమొకో".

మ. అని సందేహమునొంది దొర్లుతరి యందాముండ్లు వేవేగమే
తనకేగ్రుచ్చుకొనంగ శుభ్రమగునీదారంచునూహించు,నా
తనువేమో కడుకర్కశంబు మృదువుల్ ధర్మాత్ముపాదంబు లా
వనజాతంబులఁబోలునంచు మదిలోఁ బల్మారుదానెంచుచున్.

శా. రామా! రాఘవరామ! నన్ను దయతో రక్షింపగారావె, శ్రీ
ధామా, జాలముసేసెదేల? వినరాదా నాదు గోడంతయున్
కామా? నీదుననుంగు బిడ్డలము, లోకస్తుత్యనామా! ఘన
శ్యామా! దీనులనేచ నీకుముదమా చాలింపుమాకోపమున్.

ఉ. పావననామ! నీదయిన పాదరజంబున నాయహల్య దా
పావనవృత్తి శాపమునుబాసి సుఖింపగలేదె? మున్ను, నా
కీవనమందు దర్శనము నెందులకీయవు? జాలిలేదె? నన్
గావగ భారమేయనుచుఁగన్నుల నశ్రుకణంబు లొల్కఁగా.

ఉ. ధ్యానముఁ జేయుచుండె తనుదానె యెఱుంగదు, మార్గ మందునన్
స్నానముఁజేయగానరుగు శాలస్త్రవారలుదానిజూచి, మున్
గానగ నేరమీవిధము గర్వము హెచ్చెను నీచజాతికిన్
లేనియెడన్ననున్ గనుచు లేవక నీగతి నూరకుండునే. 64

వ. అని తలంచుచు, కోపిష్ఠుండగు నా బ్రాహ్మణుఁడు, పరమ పవిత్ర యగు నా శబరిం గాంచి, యిదియేమి? నీచురాలా! దొర్లుచు నావైపునకే వచ్చుచున్నావు. అయ్యో! నేను మైలఁబడితిని. ఇప్పు డేదిదారి? ప్రాయశ్చిత్త మొనర్చుకొనినగాని నాకిక పుట్టగతు లుండవు.

ఉ. కాలము మారిపోయె, యిది కర్మముఁగాక మరేమి? తిర్గి నే
కాలువమున్గి చావవలె, గల్గద దిప్పటికైన బుద్ధి, యీ

'మాలెత' కంచు నెంచి పలుమారులు, కోపమునాపలేక దా
కాలసమాకృతి న్నతడు కజ్జను జేకొని మూఢబుద్ధియై. 65

శా. ఛీ ఛీ పోవె యటంచదల్చుచును దాఁ జేసేత వేసెన్ గదా!
యాచారంబుగలట్టివాఁడ ననునా యజ్ఞాని, ధర్మార్థముల్
తూ, చా దప్పకఁ బల్కుచుండు ఘనులే దుర్మార్గమంచెంచరీ
వాచాలుర్మననేమిలాభమిక దేవా! సుంత యోచింపవే. 66

సీ. శాస్త్రపురాణాలఁ జదివిన ఫలమేమి?
దయయను మాటఁ దాఁ దలపఁడేని
నుపనిషద్ధర్మంబు లొప్పగించిన నేమి
కరుణ మానసమందుఁ గలుగదేని
వేదాంత వీధుల విహరింపఁగా నేమి
యనుకంప మదిలోన నలరదేని
నాచారవంతుఁడై యలరుచుండిన నేమి
జాలి నార్తులఁ బ్రోవఁ జాలడేని

తే. గీ. తపము సల్పిననేమి? తా దానధర్మ
ములను జేసిననేమి? బల్ చలమునూని
జపము నొనరింప ఫలమేమి? సకలభూత
సముదయంబుల నొకచాయ సాకడేని. 67

క. జ్ఞానము గలిగిన నైనన్
ధ్యానము దాఁ జేసిచేసి ధన్యుండైనన్

మానక యుండినఁ గోపము
గానరుగా శాంతి నెంత ఘనులున్ గూడన్. 68

సీ. స్నాన సంధ్యాద్యనుష్ఠానంబు నెరవేర్చి
పంగనామము బెట్ట ఫలమదేమి ?
సతతంబుఁ జేబూని సద్గ్రంధరాజిని
బఠియించుచున్నంత ఫలమదేమి ?
గురువులమంచును గొప్పగాఁ జెప్పుచు
పలుబోధలను జేయ ఫలమదేమి ?
పెద్దపెద్దవి మంచి సుద్దుల నుడువుచు
బాగుగా వ్రాయఁగా ఫలమదేమి ?
గీ. కోపమను శత్రువును నిరంకుశమనీషఁ
దనదుచిత్తంబులోనుండి తరుమడేని
యెంత యోగీశ్వరుండైన, నెన్ని ధర్మ
ములను నేర్చిన, నేర్పిన, ఫలమదేమి ? 69

సీ. కోపంబు కూడదు కొంచెమైన నటంచుఁ
బలుమారు వర్ణించు బ్రాహ్మణుండు
జగతిలోఁగల భూత సముదయంబులవెల్ల
నఖిలేశు సంతాన మనెడు నతఁడు

దయ ననాథలగావ దలఁపగా వలెనను
మాటిమాటికి జెప్పు మహితబుద్ధి
యన్నింటిలోనఁ దా నున్నాఁడు పరమాత్మ
యని పల్కునట్టి యా ఘనుఁడుఁగూడఁ

గీ. జెప్పుచుండును తానేమి చేయలేదు
సమయ మేతెంచినపుడు నిస్సంశయముగ
నేదియో వంక బెట్టి యేమేమొ పల్కి
తనకుఁ దప్పులు లేనట్లు దాటుచుండు. 70

ఉ. చేసితి నేను మంచిపనిఁ, జెప్పితి దీనికి బుద్ధినింక, నే
వాసిగలట్టివాఁడనని పల్మరు నెమ్మది లోననెంచి, యా
భూసురుఁడేగెసంతసముబొందుచు స్నానముసేయుకోర్కెఁ,గా
నీ చెఱువంతయున్ రుధిర నీరధి భంగిని తోచెనంతటన్. 71

చ. కులకుల లాడుచున్ క్రిములకుంఠిత వృత్తిని సంచరింపగా
బిలబిలమంచు దానికయి పిట్టలు మిన్నున గుంపుగూడుచున్
గలకల లాడుచుండె, నది కన్గొని దుఃఖమునొందుఁగాని, తాఁ
గల తెరఁగించు కంతయునుగానఁడు గర్వమదాంధబుద్ధియై.

వ. అంత నాబ్రాహ్మణుండు, మానివరుల గృహంబులకునేగి,
వారితో సరోవరంబులోని నీటి తెరంగెఱింగించిన, వారం
దఱు నక్కడికరిగి యెంతయో విచారించుచు.

శా. దానింజూచుచు బాధనొందుచు నహా! తానెవ్వఁడో దుష్టుఁడీ
కానంజొచ్చి, తపంబులన్ జపములన్, గాల్వంగనూహించి, వే
పూనెన్ దారుణ దుష్టకృత్యమునకున్ బుణ్యాత్ములారా! సదా
ధ్యానింపుండిఁక రాఘవేంద్రు నతఁడే తప్పించు నీయాపదల్.

చ. అని సలహాను జెప్పుకొని యందఱు గుంపుగఁగూడి రామునిన్
వినుతిరియొన స్త్రీ కాని యవివేకముచేతను జేసియున్న, యా
పని కడు తప్పటంచనియుఁ బాపమటంచును నెంచఁబోరు, వే
కమగొని యాతపస్విని గాంచెదనూహనొనర్పరక్కటా.

శా. రండయ్యా! యికరండు వచ్చెనటగా రాముండు, మొన్నొన్న నే
చెండాడెంగద? దానవాళి నిపుడే శీఘ్రంబుగాఁబోవ నీ
గండంబున్ గడువంగలట్టివిధమింక౦జెప్పు నాతండు, చూ
డుండయ్యా? వెదకుండు, కేల్మోగిచి కడుంబాపనర్దింపుఁడీ !.

ఉ. మాటను ద్రోసివేయఁ డభిమానధనుండతఁ డెట్టులైన, నీ
చేటుఁ దొలంగఁజేసి యికఁ జేకుఱఁజేయునుగాన లాభముల్
చాటును మాటదేల? కల సర్వమునాతని తోఁడఁజెప్పి, యీ
పాటుఁదొలంగజేయుమని ప్రార్థనజేయుఁడుమీారలందఱున్ .

ఆ. వె. అనుచుఁ జెప్పికొనుచు నరిగిరి వారలు
రాముఁగాంచు వేడ్క రంజిలంగ
నతఁడు వచ్చునిప్పు డందఱ రక్షించు
ననెడు నాశతోఁడ నడుగులిడుచు.

వ. అప్పుడా మహానివరులందఱును దమముందట

సీ. కనపడ్డ వారితోఁ గనబడెనా ? భిల్ల
వనిత శబరియంచుఁ బలుకువాని
దీనురాలా పెదా దిక్కుగాంచిరె మీార
లంచు వచ్చెడివారి నడుగువాని
గండ్లు కాయలుగాయ గాంచుచున్నది నాదు
దారి నెల్లపుడటంచుఁ దలచువాని
నెట్టు లామెనుగాంతు నేది మార్గంబంచుఁ
బలుమారు తొందర పడెడువాని

గీ. నీలనీరదవర్ణుని, నిరుపమాన
బాహు బలశాలిఁ గోదండపాణిఁ, బరమ
కరుణ దీనుల ననదలఁ గాచువాని
గాంచి రామహానివరులు రాఘవుని నపుడు. 78

తే. గీ. పెన్నిధిని మ్రోలఁగన్నట్టి పేదవాని
చందమున, రామచంద్రుని యందచంద
ములను బొగడుచు సద్గుణములను జెప్పి
కొనగసాగిరి హర్షాశ్రు కణము లొలుక. 79

సీ. గాధేయు యాగంబుఁ గాపాడి కీర్తిని
గన్నట్టి సుగుణాల గని యితండె
దీనులగాచు నా పూనికతోఁ దన
రాజ్యంబు వీడిన రాజితండె

అసురాళి బాధల నడపఁగా వలెనని
వసుమతిన్ బుట్టిన ప్రభువితండె
మనయాపదలఁ బాప వనమున కేతెంచి
కష్టముల్ గనుచున్న ఘనుఁడితండె
గీ. తండ్రి యాజ్ఞను దలఁదాల్చి తరుణితోడఁ
దమ్ము కుఱ్ఱఁడు వెంటరా దండకాట
విని జరించుచునున్న సజ్జనుఁ డితండె
మనల రక్షించు నాతఁడీ ఘనుఁడె చూడ. 80

క. ఇతఁడే మనలను బ్రోచును
ఇతఁడే యాపదలబాపి యేలును దయతో
నితఁడే ప్రణతార్తిహరుం
డితఁడే రక్షించుదైవ మితఁడే యనుచున్. 81

సీ. మాయింటికినివచ్చి మమ్ము ధన్యునిజేయు
మనుచుఁ బ్రార్థించెను ముని యొకండు
ముసలివాఁడను దేవ! యసువులునిన్ జూచు
నాశచే నిల్పితిననియె నొకఁడు
పాపంబులెడబాపి పావనాత్ములజేయు
ప్రభుడవంచును కాళ్లఁబడియె నొకఁడు
నీత్రోవచూచుచు నిఖిలేశ్వరా! యుంటి
నరసి రక్షించుమా యనియెనొకఁడు

గీ. నీవురాకున్న మేమింక నిలువలేము
మా దు కష్టంబు లీడేర్చి, మమ్ముఁగాచు
కరుణ నీమదినుంచగా, గలుగు మాకు
నెల్ల శుభములటంచు వచించె నొకఁడు. 82

వ. అంత రామభద్రుండా జడదారులతో నిట్లనియె.

తే. గీ. తపసి వరులార! పెద్దలా ధన్యులార!
మనవి యొకటున్నదయ్య మీమనములందు
వేరుగా నెంచబోవక వినుడుమీకు
శబరియింటికి నిప్రుడేము చనగవలయు. 83

ఆ. వె. మీరుకూడరండు మీకష్టములగూర్చి
మాటలాడు కొనుట మంచిదనుచు
వినయ ముట్టిపడగ విన్నవించెడురాము
ననుసరించి జనిరి మునులుగూడ. 84

తే. గీ. శబరియన్న దూరంబుగా సాగనంప
బడితెఁ జేబూనునట్టి యా బ్రాహ్మణోత్త
ములునుగూడను బ్రతిమాట బలుకకుండ
నామె యింటికి జనిరి యా రాముఁగూడి. 85

క. ఎంతని జెప్పఁగ నగు, వే
దాంతుల కందంగరాని యా దైవమె, తాఁ

జెంతకు వచ్చెంగద, బల్
వింతలుగా భక్తరామదాసు వృత్తము లెన్నన్. 86

వ. ఆ సమయంబున బ్రాహ్మణునిచే దెబ్బలం దినినను, ధ్యానావస్థలో నున్న కతంబున, నావిషయంబు నైతమెఱుంగక, యప్పరమపావని యథాప్రకారముగా మార్గమునందు దొర్లుచు, శ్రీరామచంద్రుని గురించి పాడుకొనుచుండె.

ఉ. జాలము సేసెదేల, కనజాలవొ ? నాదురవస్థలో జగ
జ్జాల వినోద ! దీనులను జాలిని జూపుచు నేలుదంచు, నీ
పాలనుబడ్డ నన్ను దయం బాలనసేయుట భారమే ? రమా
లోల! దయాలవాల! భవలుంఠనకోవిద! భక్తకామదా. 87

ఉ. కోరను వేరు కోరికలు, కోరినదొక్కటె నీలవర్ణ ! సం
సార మసారమంచు గనజాలిన బుద్ధినొసంగి, భక్తమం
దారుండవైన నీపదముదారత గాంచగనిమ్ము, జానకీ
చారు మనోజ్ఞమిత్ర ! సురచారణ కిన్నరవంద్య ! రాఘవా.

క. రాదా ? నీదయ నాపై
లేదా ? యభిమాన మిపు లేశము గూడన్
నీదానను నేగాదా ?
వాదా ? సురనాథ వినుత పాదా ! రామా. 89

క. పారావారగ భీరా !
మారాకారా ! సుధీర ! మావర ! నాపై

నేరా లెన్నుచు నుండుట
దేరా ? నీదేర భార మీశ్వర ! రారా. 90

క. పాపము నా పరితాపము
చూపుము నీ రూపమిప్డు సుగుణాభరణా !
కోప మదేలను దేవా !
పాపములన్ బారద్రోలు ప్రభుడవుగావా.? 91

క. అవివేక తిమిర భాస్కర !
ధవళాంబుజనేత్ర ! శౌరి ! దశరథపుత్రా !
రవివంశ జలధి సోమా !
భవసన్నుత నామ ! సుజనపాలా ! రామా ! 92

తే. గీ. ఏమియోగాని యేలొకో ! రామచంద్ర
మూర్తి నడకను జాలించి, మోముదమ్మి
కరుణరస మొల్కుచుండగాఁ, బరుగు లెత్త
సాగె, తమ్మునితోడ నా చక్కి కపుడు. 93

తే. గీ. సోదరా ! రమ్ము వేగమే చూడుమయ్య !
నేలపై దొర్లుచున్న దదేలనో గ
దయ్య,? రక్తముగారెడు నయ్య ? తలను
కారణంబేమొ నీమదిఁ గాంచినావె ? 94

# భగవత్సాక్షాత్కారము

తే. గీ. అనుచు వచియించుచును వేగనరిగి యటకు
నామె శిరమును దన యొడియందు జేర్చి
కొని, కృపాదృష్టి నామెను గనుచునుండె
దీనజన పాలకుడుగదా ? దేవుఁడెపుడు. 1

వ. అప్పుడా శబరి.

తే. గీ. కనుల వెంబడి బాష్పముల్ గారుచుండ
రామ ! యోరఘురామ ! శ్రీరామ ! రావ
దేల ? కరుణాలవాల ! యీజాలమేల ?
ననుచు బిలచునుగాని తాగనదురాము. 2

తే. గీ. ఎదుటనున్నట్టి యాతని నింతయైన
నాదరించదు, వచ్చితే యనదు, చాల
ధన్యురాల నటంచును దలపఁబోదు
పరమపావని యాభక్తి భావభరిత. 3

చ. ఎఱుగదు భూసుకుండు తను నెంతయు మోదుట, గాయ
మయ్యె నం
చెఱుగదు, కంటకంబులవి యెన్ని శరీరమునందునున్న వో
యెఱుగదు, రాముురాక యది యించుక యేని మనంబు
నందు దా
నెఱుగదు, తన్మయత్వమున నెంతయుఁ బ్రార్థన సేయుచుండుటన్.

ఉ. అంతట రాఘవేంద్రుడిదియట్టి కనుంగొని జాలినొంది, యా
చెంతలనున్న వారలను, జేసెద మీకొక విన్నపంబు, మీ-
రెంతయుభక్తితో సలుపుడిప్పుడు కేశవు నామకీర్తనం
బంతట దెల్పెయీ మెకనునంచు వచింపగ మౌనివర్యులున్.

తే. గీ. అందఱున్‌గూడ భక్తితో హరినిదలచి
పాడసాగిరి గొంతెత్తి, యాడసాగి
రందుఁ గొందఱు నర్తకు చందమునను
మధురభక్తిరసంబు పైమరువఁజేయ. 6

ఉ. అందఱునొక్కసారి వికచాంబుజనేత్రునిగూర్చి పాడు నా
చందము నెంచగాఁదరమె! సప్తమహాంబుధులేకమాచు, నా
నందముతోడ నామభజనంబు వినంగను వచ్చెనో యనన్
సందులు గొందులున్ వనము సర్వజగంబునునిండె కీర్తనల్.

క. రామా, రామా, రామా,
రామా, శ్రీరామ, రామ, రామా, రామా,
రామా, రామా, రామా,
రామా, శ్రీరామ, రామ, రామా, యనుచున్. 8

తే. గీ. భజనఁజేసిరి సర్వులు భక్తిరసము
పొంగి ప్రవహింప, యోఋలపోల్కి, నపుడు
వినెడువారలు గూడను తనువు మరచి
ఘనతరానంద వనిధిలో మునిగిపోవ. 9

ఉ. ఎప్పుడు వీనులంబడెనో! యెంతయు సమ్మదమొప్పలేచి, తా
నప్పుడు కండ్లువిప్పి కనులార కనుంగొనదేమి రాము? నో
రెప్పలకప్ప! దేవ! యిటులొప్పునె, జాలముసేయనీకు, మా
యప్పవుగావె! యన్నలుకు నంతట రాఘవుఁడాలకించుచున్.

ఆ. వె. ఎదుటవచ్చి నిలువ హృదయమందున భక్తి
భావమధికమగుచుఁ, బావనాత్ము
చరణ తలములందు సాగిలబడుటయే
గాని కనులువిప్పికాంచ దతని. 11

తే. గీ. రామచంద్రుని కోఱకునై రాత్రిపగలు
నెప్పుడు వచ్చునో! యేమొ? యంచెప్పుడు జూచు
పరమపావనురాలగు పడతిమిన్న
చేయదేమమ్మ! మర్యాద శ్రీశునకును. 12

ఉ. రమ్మని బిల్వదేలనో! కరమ్మనురాగముతోఁడ నర్ఘ్య పా
ద్యమ్ముల నీయదేమి! కనుదమ్ములువిచ్చుచుఁ జూడదేమి! పీ
ఠమ్మునొసంగదేమి! కదుడాంబిక ప్రత్తిని జూపదేమి! చి
త్తమ్మున భక్తిభావ రసధారనుమున్గుచు దేలుచుండుటన్.

తే. గీ. పాదములమీద నున్నట్టి పడతిఁగాంచి
కనుల నానంద బాష్పముల్ గ్రమ్ముకొనగ
మధుర కరుణారసంబున మగ్నుఁడగుచు
లేవదీయుచు రాముఁ డీరీతి ననియె. 14

ఉ. ఆకలి తోఁడనుంటినిఁక నాగఁగలేకను వచ్చినాఁడ, నే
నీకడ కింతవేగముగ, నెమ్మనమందలి యాశఁదోఁడ, గా
నీ కడుఁ జోద్యమయ్యె, నను నీవిపు డాదర మేమిజేయ కీ
పోకడలెల్ల బోవుటలు పోదము రాగదవమ్మ ! యింటికిన్. 15

క. అమ్మా ! యిపు డింటికి వే
రమ్మా, నాకిమ్మ మంచిరకముల పండ్లన్
లెమ్మా, యేటికి నిటు పా
దమ్ముల బడుచుంట పెద్దదానవుగాదా.! 16

సీ. బ్రహ్మ యెప్పుడు పరబ్రహ్మార్పణంబని
యొసగు పదార్థంబు నసిగలేక
దేవదేవా వీని దినుమటంచును దేవ
తలు బెట్టువానిపై తలపులేక
సప్తమహర్షులు సామిసామి యటంచు
నిచ్చుభక్ష్యంబుల మెచ్చులేక
కైలాసనాథుడు గారవంబుననిచ్చు
నాతిథ్యమందునఁ బ్రీతిలేక

గీ. యేమొగాని మరేమియో ! యెఱుగలేమ
దెప్పుడును తిండిమాటయే యెఱుగనట్టు
లామె యెదుటను నిలబడి యడుగసాగె
ప్రేమభక్తికిలోఁబడు సామియగుట. 17

సీ. రమ్ము వేగమె యోగిరమ్మును గొనుమంచు
పెట్టలేదే తల్లి ప్రేమతోడ
నాయొద్దతినుము మానాన్నయంచును జాల
బ్రతిమాలడే తండ్రి ప్రతిదినంబు
పలురకంబుల భక్ష్యముల నీయడేమామ
జానకినొసగు నాసమయమందు
తనయాగమునుగావఁ దరలివచ్చిన యప్పు
డైనను గాధేయుఁడన్న మిడఁడె ?

గీ. మొగమువాచెనె యాహారమునకు నతడు
ప్రేమతో భక్తులొసఁగెడి దేమియైన
నెంతయోరుచ్య మనుచు దానెంచునంట
ప్రేమభిక్షార్థియగుట నారామవిభుడు. 18

ఉ. చిత్రము! రాఘవేంద్రుడు వచించిన మాటలు విన్నయంతనే
నేత్రములన్ ముదశ్రువులు నిండగ నాతని రమ్మటంచు, దా
నాత్రముతోఁడఁబిల్చి తన యాశ్రమభూమికి, లోని కేగి, స
చ్ఛాత్రులతోడనొప్పుమునిసంఘమునివ్వెరగంది చూడఁగన్.

ఉ. తెచ్చితి మంచిపండ్లనివి తియ్యనివే తినుమంచు, వెంటనే
యిచ్చెను రామచంద్రునకొకించుక యేమియు నెగ్గులేక, తా
మెచ్చుచు వానిదారుచిని, మేలనియెంచి భుజింపసాగె, నా
సచ్చరితాత్ముఁడా శబరి సత్కథలెన్నగ నేరి శక్యమా ?. 20

గీతమాలిక :-

తానుతినుఁగాక, మంచిదా ? తపసివరుల
కందఱకుఁగూడ ఫలముల నౌర ! రాముఁ
డపుడు పంచఁగసాగె నౌ నౌను ధర్మ
మార్గ మెఱుగనివాఁడె ? రమాధవుండు
గాఁడె ! యొక్కఁడు దినినచోఁగాదు ధర్మ
మనెడు సూక్తినిబాటించి మనమునందు
తమ్ము కుజ్జుడుగూడను తనకుసాయ
పడగ నందఱికిచ్చెను పండ్లనెల్ల. 21

శా. ఇల్లున్ వాకిలిగూడ వీడి యనువౌ నిల్లాలిని న్వీడి, తా
మెల్లప్డున్ వెలిచూపుమాని మదిలోనే దేవుజింతింతురా
ముల్లోకంబులనేలు సామియె ఫలంబుల్ బంచి యీయంగ, నే
రొల్లంజాలరు ? మందబుద్ధులొకొ ! యాయుర్వేసురేంద్రుల్
ధరన్. 22

వ. అంత శ్రీరామభద్రుండామునుల నవలోకించి యిట్లనియె.

క. అయ్యా, మిమ్ములనందఱ
నియ్యెడకున్ దోడితెచ్చి, యిచ్చితిశ్రమ, మీ
కయ్యెడు నికభద్రంబులు
చయ్యన మీరాజ్ఞనిడఁ ప్రసాదంబనుచున్. 23

క. నానేర్చిన కొలఁదిగ, నేఁ
బోనాడెద, మీదు కష్టముల నింకను, నేఁ
బూనెద శిరమున బాధ్యత
మానితగుణులార! యన్న మౌనిశ్రేష్ఠుల్. 24

శా. రామా, నిన్న నె యొక్కరక్కసుడు దుర్మార్గుండు, మాయావి, దా
నేమో, రక్తముమాంసమున్ జెలువులో నేపోసి పోయెంగదా
స్వామీ, యేదిపథంబుమాకికనుమాస్నానాద్యనుష్ఠానముల్
యేమార్గంబునఁ దీర్చుకోగలమయో యేరీతి జీవింతుమో.

క. రక్షింపు మమ్ము నిప్పుడు
వీక్షింపు దయార్ద్రదృష్టి, వేగమె దనుజున్
శిక్షింపు, మా ర్తరక్షణ
దీక్షా! మునివంద్య! రఘుపతీ! శ్రీరామా. 26

వ. అంత రామభద్రుండు వినయముట్టిపడ.

ఆ. వె. ఇంత సెప్పనేల నిదిజేయుమనుచు, మీ
రానతిచ్చి రేని యాక్షణానఁ
జేయసిద్ధమయ్య! సేవ మీకెప్పుడు
నాదుమాటలెల్ల నమ్మియిపుడు. 27

ఆ. వె. చేయుడొక్క పనిని జెచ్చెర నీభిల్ల
వనిత మీదు వెంట వచ్చునటులఁ

జేసికొనగ, నీమె చేతులకొనంట
సరసులోనినీరు చక్కనగును. 28.

వ. అని రఘుకులాంబుధి శశాంకుండైన శ్రీరామభద్రుండు వచించిన, నా మునులు కోపోద్రిక్త మనస్కులై.

గీ. "శబరి యింటికి రప్పించె, చాలకంత
నామె ముట్టిన పండ్లను ప్రేమతోడ
నందఱకునిచ్చి తినిపించె నదియుచాల
నట్టులామెను ప్రతిమాలుడనుచు బలికె. 29

క. ఏమోయని యనుకొంటిమి
రాముండని యున్న నతనిరాకడ నూడన్
బామరము నీతి బాహ్యము
లే, మనమిక పోదమనుచు లేచిరి వృద్ధుల్". 30

ఆ. వె. "ఎందుకింత తొందరిప్పుడు మీకిక
మనము కష్టమునను మునిగియుంటి
మందువలన కోపమందక మీరలు
వినుడు రాముమాటలనుచు" యువక
గణము నచ్చఁజెప్ప ఘనులందఱప్పుడా
ముదుకదాని యెదుట మొగము వాంచి
"మాదు వెంటరమ్మ మాసరస్సున నీరు
బాగుజేయుమమ్మ జాగువలదు. 31

శా. అమ్మా, రమ్మనిపిల్వ," నామెయను నయ్యా! మూఢు
రాల న్ననున్
సమ్మానింప బనేమి? నీచనపదన్ సద్ధర్మవేత్తల్ గదా
యిమ్మాడ్కిన్ బలుకంగ మీకుదగునే? యేమందునయ్యా
ననున్
రమ్మాయంచునుబిల్వనాయఘమగునారావో మహాదోషముల్.

క. పాపాత్మురాల నయ్యా
కాపాడుడు నన్ను మీరు కనికర మొప్పన్
నాపాలిటి భగవంతులు
బాపన వరులంచుఁ దలతు బలుమరు మదిలోన్. 33

తే. గీ. ఇంత దుష్టురాల నింత నీచను నేను
వారినెట్లు శుభ్రపరచుదాన
నైన రామచంద్రుఁడానతి నిడెఁగాన
వత్తుననుచు వృద్ధపలికె నపుడు. 34

వ. అంత నాసరోవర తీరంబున కందఱు నరుగ నావార్తవిని, యాస్థలంబునకు గుంపులు గుంపులుగా జనంబే తెంచిరి.

క. వచ్చిరి భిల్లులు శబరులు
వచ్చిరి సన్న్యాసి వరుల వనితలు గూడన్
వచ్చిరి పండితులందఱు
నచ్చోటను తీర్థమల్లె యలరెన్ జూడన్. 35

సీ. కారణంబేమి యీకల్లోలమున కంచు
నక్కడివారల నడుగువార
లేమియీచిత్రం బదేలయిందటుగూడ
గుమిగూడి నారంచు గోణుగువారు
ముదుసలి తొక్కటోఁ గుదురునే పనులంచు
ముక్కుమీదను వ్రేలు మోపువారు
వేరుమార్గము లేక వెఱ్ఱివారై పోయి
నారలీ మునులంచు నవ్వువారు

ఆ. వె. ఏమొ ? చెప్పలేమ దెంతయో మహిమంబు
గలుగు నీచులకును ఘడియలోనె
యనుచుఁ దలచు వారలైరిగా యచ్చట
నున్నవారు చూచుచున్నవారు. 36

సీ. గజగజ వణకెడు కరమున నొక కఱ్ఱ
యడు గడ్డునకును నుయ్యాలలూగ
ముదిమిచే శిథిలమై వ్రోడయి పోయిన
యొడలుదానికి సాయపడుచునుండ
మునుల వెన్వెంటనే చనుచున్న భయమునఁ
గంఠ మెండుకపోవు గతినిజూప
నడుగువేయుటకైనఁ దడబడుచుండు నా
పాదముల్ పూచిక పగిదిఁ దోప

గీ. అని లవాలినొందు దీపంబు ననుసరించు
చున్న హృదయంబుతోఁడ, దాఁ, జోద్యముగను
గాంచువారల నందఱ గాంచఁజొచ్చె
పావమాతల్లి భక్తుల పాలవెల్లి. 37

ఉ. దండముబెట్టు నందఱకు, తప్పుసుమా యిటువీరితోఁడఁ గూ
ర్చుండుటయంచు నెంచు,నగరోనను గేలిని సేయఁబోరొ,యీ
పండితవర్యులున్ మునులు భక్తశిఖామణులంచు నెంచు, నీ
దండ నెయున్న నాకు నిక ధైర్యమెయంచునుతించు రామునిన్.

ఉ. పుట్టినదాది, పెద్దలకుఁబోవుచు దూరముగాఁగ, వారు గ
న్పట్టిన చాలభీతిలి చివాట్లను బొందుటకిచ్ఛలేక, నే
చెట్టుసమీపమందుననొ చిక్కఁగబట్టుక ప్రాణముల్, సదా
గుట్టుగనుండు నాపెకొనగూడు నె సాహసమెంచి చూడగన్.

తే. గీ. దేవదేవుని కృపగల్గ నావగింజ
యైన ధరణీధరంబుఁ దానట్టె గెలుచు
నతనిదయలేనిచో పర్వతాధిపుండు
గూడలొంగును గింజకే గొప్పదనుచు. 40

తే. గీ. అట్టి మహిమాన్వితుండు శ్రీహరియె తనదు
పక్షమైయుండ, నా భిల్లవనితనేమి
యనగ జాలుదు రెవరైన నామెకేమి
లోపమున్నది ? యీమూఁడు లోకములను. 41

ఆ. వె. పిచ్చితల్లి ! రమ్ము, జెచ్చెరనిట కట్లు
తెల్లబోయెదేల ? దీనవగుచు
లేదులే భయంబు రాదుగా కష్టమ్ము
నడువుమింక వేగ నడుగు లిడుచు. 42

ఆ. వె. అనుచు బుజ్జగించి యనఘుండు రాముండు
కంపమొందు నామె కరము నపుడు
నీటిలోనముంచె నిమిషమాత్రంబులో
శుభ్రమయ్యెనీరు చోద్యముగను 43

వ. అంత శ్రీరామచంద్రుండు తెల్లబోయిచూచుచున్న యా
మునివరుల నవలోకించి.

ఆ. వె. చూచుచుంటిరేల చోద్యంబుగామీరు
పతితజనులఁగాచు పావనాత్ముఁ
డాదిదేవుఁడతని నాశ్రయించినయట్టి
యధముఁలైన మహిమనందు చుంద్రు. 44

చ. శబరులటంచు, భిల్లులని సంకరజాతి యటంచు నూరకే
ప్రబలఁగజేసి వైరమును పాడిదలంపఁగలేక యెంతయో
సబలులమన్న గర్వమున చాలగవారల బాధబెట్టుటల్
సబబని మీమదిన్ దలఁచు సాహసకృత్యములింక మానుఁడీ.

తే. గీ. దీనజనులను దయఁజూచు దీక్షనూని
వసుధ జరియింపవలెగాని, కసినిబూని

బాధలనుబెట్టి వారి నగాధమైన
కష్టములపాలుచేయఁగాఁ గలదె ముక్తి? 46

తే. గీ. సకలజీవుల దయఁజూచు సమతబూని
మీచు మనముల నింకను వాదబుద్ధి
విడిచి, దీనులసేవయే విభునిసేవ
యనుచు నమ్మిన ముక్తిని గనెదరయ్య! 47

తే. గీ. దేవదేవుని కృపనొంద భావమందుఁ
గోరుచుండిన నామాట మీరకుండ
నందఱిని నొక్కరీతిగా నరయుఁడయ్య!
హెచ్చు మేమను గర్వంబదేల నయ్య? 48

తే. గీ. దిక్కులేనట్టి వారల దిక్కుగాంచి
యనదలై యేడ్చువారల నాదరించి
ప్రాణులన్నియు నొకటియన్ భావమెంచి
వాని సుఖమునకై పాటుబడుచు మనుడు. 49

వ. ఆసర్వాంతర్యామి, యెన్నిరూపంబుల మనచెంతకు వచ్చుచున్నాఁడో, యెన్నివిధంబుల మనలను దన సన్నిధికిఁ బిలుచుచున్నాఁడో, మనము గుర్తింపఁజాల కున్నాముగదా!

గీ. గుమ్మమందున నిలబడి గుప్పెడన్న
మడుగుచున్నాడు మాటలు తడబడంగ

మనమొ ? పటముల నెప్పుడుఁ గనుచుఁ బూలఁ
బూజసేయుచునున్నామొ పోల్పలేము. 50

గీ. దాహమంచును బలికెను, దప్పితోఁడ
నెండ నోరంచు వేడ వేరొండుకడకు
నేగుమంచును బలుకుదు మెప్పుడుఁగూడ
ధ్యానమును జేయుచుండెడి తరుణమందు. 51

గీ. ఆకుటీరంబులోపల నరయుఁడయ్య !
ఆకలంచును పసికందు లందఱేడ్చు
చుండఁగా రోగియై మూల్గుచుండె 'నతఁడు'
మనమొ ? ప్రార్థనసేయుచుఁ గనమువాని. 52

గీ. అన్నమంచని యడుగఁగా నతనికిడము
దప్పికంచును వేడగా దాహమీయ
మెండలోనుండ నిట నీడనుండుమనమ
దెట్టులాతని గుర్తింతు మేదిదారి ? 53

గీ. హస్తముల నుంచుకొని పండ్ల నతని గుడికి
పోవుచుందుముగాని యాత్రోవలోనఁ
గ్రాగుచుండెడి మెట్లపై వేగుచున్న
యతని నక్కటికంబున నరయలేము. 54

వ. మీలోనొక్క భూసురవరుండు, ధ్యానంబు నందున్న
యీామెను, కాని మాటలాడి, శిరస్సుపైఁ గొట్టుటవలన,

నీసరస్సులోని నీరం బీవిధముగా రక్తంబు - తెరంగునన్ దోచెc, గావున నెన్నcడును దీనులను బాధింపక వారల జాలితోcగనుచు, సేవజేయుచుండుడు.

తే. గీ. పాపమంచును నొకమారుc బలుకcబోము
దయ ననాథలగావగాc దలcపcబోము
దెప్పుడునుగూడ నొసగము గుప్పెడన్న
మిట్టి మనకెట్లు కన్పట్టు నీశ్వరుండు. 55

తే. గీ. తీర్థయాత్రలకేగిన దివ్యఫలము
కోటినదులందు నెప్పుడుగ్రుంకు ఫలము
యజ్ఞయాగంబులున్ జేయునట్టి ఫలము
గనెద మార్తులసేవ నిక్కంబునుండు. 56

ఉ. ఎందుల కింతచర్చ యిటులేటికి మీామది సందియమ్ము, నే
మందును మీాదుజ్ఞానము, మహాత్ములుమీారలుగాన, నిప్పుడీ
చందమునన్ వచించుటది సాజముగాదిక, దీని మీా మనో
మందిరమందునుంచి యనుమానుమాని భువిన్ జరింపుడీ.

ఉ. చేసితి విన్నపంబులను జెప్పెడిదేమియులేదుగాన, మీా
వాసి దొలంగ బోదికను వాదములన్ విడనాడి, సేవయే
జేసినమెచ్చు 'నాతcడి'ది చేరెదు త్రోవగదయ్య! 'యాతనిన్'
బాసలcజేసి యాపతితపావనుగీర్తనసేయుc డందఱున్. 58

ఉ. నిర్మలమైన చిత్తమున నిచ్చలు పాయని భక్తిఁ గోడ, స
త్కర్మములాచరించి, దయఁదప్పకయుండుట మేలుగాని, దు
ష్కర్మ్మలటంచుఁ బేదలకుఁగానిదొసంగులఁ జేయుచుండుటల్
ధర్మ్మమటంచు మీమదిఁ దలంపకవారల నాదరింపుఁడీ. 59

ఉ. పిన్ననునేను మీరు కడుఁబెద్దలు, ధర్మమెఱుంగు వారలా
పన్నులఁగాంచివారలను బాధలబెట్టుట మానుఁడయ్య,! నా
విన్నప మాదరింపుఁడిటు వేదములోనని చెప్పుచుండె, నీ
తెన్నునఁబోవ మోక్షమది తెచ్చునుమీకయిపుప్పహారమున్

గీ. వలదు వలదయ్య ! భేదంబు వలదు వలదు
సకలజీవులుఁగూడ నాసర్వమయుని
బిడ్డలే యగుటచే మీరు ప్రేమతోఁడఁ
గాచుచుండుడు నెమ్మదిఁ గరుణకలిగి. 61

# పరబ్రహ్మైక్యము

ఉ. అంతట ధన్యయాశబరియారఘురామునిమోముఁజూచి, తా
నెంతయు భక్తిఁబల్కెనిటు లేమయ్య,! దేవర! రామచంద్ర! నీ
వంత మదేమొగాని యిటు బల్వుర మధ్యకుఁదెచ్చినన్ను, నీ
వింతల నాచరించుటలు వేడ్కఁగఁదోచెనె నీమనంబులో. 1

ఉ. దండము వెట్టు దాసులకు దండను నీవెపుడుందువంచు, బల్
మెండితనాన మమ్ములను మోసము సేయుచుగోతఁద్రోయు, నా
చండమహోగ్ర సంసరణ సాగర వీచికలెల్ల పైకి రా
కుండ సదాహృదబ్జమున నుండుచుఁబ్రోతువుగాదె రాఘవా!

సీ. మగమీనువై వార్థిమధ్యమందునఁజొచ్చి
దైత్యుఁజంపినయట్టి దైవమీవె
కూర్మరూపముతోడఁ గొండ వీపునమోసి
జగములన్నియుఁగాచు జాణవీవె
కిటివై హిరణ్యాక్షుఁ బటుదంతములఁగూల్చి
కీర్తినందిన మహామూర్తివీవె
నరసింహరూపివై దురితపంక నిమగ్నుఁ
గనక కశిపుజంపు ఘనుఁడవీవె

గీ. పొట్టివై క్షత్రియుకెల్ల పొగరడంచు
దిట్టవై, కోసలాత్మజ పట్టివైన
నిన్నుగొనియాడ దరమె యాపన్నగేశ్వ
రునకునైనను వాణీశ్వరునకునైన. ౨

మత్తకోకిలము :—

నీదునామము పాపపుంజము నేలకున్ బడగొట్టుచున్
నాదబిందు కళాత్మమై భవనాశనం బొనరించుచున్
భేదమింతయులేక సర్వుల భీతిమాన్పుచు నుండునో
వేదవేద్య! ధరాత్మజావర; విశ్వసన్నుత! పాహిమాం. 4

తరలము :—

ధరణిభారము మాన్పఁబుట్టిన ధర్మమూర్తి వటంచు, నీ
చరణకంజము లాశ్రయించిన సాకుచుందు వటంచు, నే
గురునిసన్నిధి వింటిగావునఁ గోరనింకొక కోర్కెలు, నిన్
స్మరణసేయుచునుందు నెప్పుడుమాధవార్చిత పాహిమాం.

వ. అప్పుడు శ్రీరాముండా శబరికి నవవిధ భక్తిలక్షణంబు-
లుపదేశించు తలంపున.

క. తల్లీ ! దేవుని నెప్పుడు
నుల్లంబున నమ్మ నీకు నుండునె ? కొఱతల్
తెల్లంబుగఁ దెలిపెద విను
మెల్లవిధంబులను భక్తి నెఱిగెద వీవున్. 6

వ. అది నవవిధంబులు

తే. గీ. భక్తిభావంబు మదిలోనఁ బాదుకొల్పి
యమృత మాధుర్య మొలుకు నా యాదిదేవు

కథల నెప్పుడుఁగూడను కర్ణయుగళి
వినుచు నన్యంబు విననట్టి విధమదొకటి. 7

ఆ. వె. స్మరణ సేయుచుండి సకలేశురూపంబు
మరవకుండఁ దనదు మనమునందు
బాహ్యదృష్టిమాని పరమాత్ముఁ డొక్కఁడే
తనకు దిక్కటంచుఁ దలపవలయు. 8

తే. గీ. చేతులందునఁ దాళముల్ మ్రోతలిడగ
నెంతయో ప్రీతి గొంతెత్తి యెప్పుడుఁగూడ
పాటఁబాడుచు నాతని బలువిధాల
కీర్తనము సేయవలయు సంకీర్తనముల. 9

తే. గీ. అఖిల లోకైకపూజితుం డగు మురారి
పాదపద్మమ్ములకు నెప్డుఁ బ్రణుతిసేసి
దిక్కులేనట్టి తనకవే దిక్కటంచు
నెమ్మదిని నమ్మవలె జీవితమ్మునందు. 10

తే. గీ. ఆ మహామహుమూర్తిని యనయమెదుట
నిల్పుకొని మోదమునఁ బూజ సల్పవలయుఁ
బూలతో పత్రితోఁడ, నాపుణ్యపురుషు
శాస్త్రములఁ జెప్పియున్నట్టి సరణిరొప్ప. 11

తే. గీ. అంతటను నిండియుండెడునట్టి 'యతఁడె'
తనకుఁ బ్రభువని నమ్ముచుఁ దండ్రి! నీదు
దాసుఁడనుగాన దయఁజూడ ధర్మమనుచుఁ
గొలువవలె నాతనిని సేవసలుప వలయు. 12

క. తన మిత్రుఁడాతఁడేయని
మనమునఁ దలపోసి సఖ్యమతమున, నిరతం
బనఘా! ప్రాణస్నేహితుఁ
గను, నను గనుగొనుమటంచుఁ గనవలె శాంతిన్. 13

క. నీవేదిక్కనుచును నా
భావంబున నమ్మియుంటిఁ, బాలింపఁగదే
దేవా! లే రొరులెవ్వరు
నీవాఁడనటంచు వాని నెమ్మది నెపుడున్. 14

తే. గీ. నమ్మికొలచుచు, తనదు సర్వమ్ముఁగూడ
నతనికర్పించి, యాతఁడే గతియటంచు
తనునిమిత్తంబెగాని యాఘనుఁడె తన్ను
నేలువాఁడని మదిలోన నెంచవలయు. 15

తే. గీ. ఎందఱో భక్తవరులను దొందరగను
సుందరాకార! గాచితి వందురయ్య!
వందనం బందుకో యరవింద నయన
మందరాద్రిధరా! యనిడెందమునను. 16

క. కందర్పజనక ! నాకో
నెందుకు నీవాదమయ్యె ! యేలా ? దయ నా
యందునఁ జూపవు, హరి ! గో
విందా ! యని ప్రణుతిసేయు విధ మొండబలా !. 17

వ. అమ్మా ! నీకు భక్తిమార్గంబును గురించి చెప్పుట చర్విత
చర్వణమే యగును.

క. అంతట నాతని రూపము
సంతసమున గాంచితమ్మ ! శబరీ ! యింకన్
వంతను బొందగనేలా ?
చింతల విడనాడి ముక్తిఁజేకొను మమ్మా ! 18

తే. గీ. అధమకులమందుఁ బుట్టితినంచు నీవు
బాధపడెదేలనే తల్లి ! పాపరాశి
దగ్ధమును జేయఁగల్గిన దానవమ్మ !
భక్తి నీ సరివారలెవ్వారు లేరు. 19

వ. అని శ్రీరామచంద్రుండు మునులకడ సెలవు గైకొని
చనుచున్నంత నా శబరియు,

సీ. తండ్రి యిట్టులనీవు ధర్మంబు దలఁప కీ
ముసలి త్రొక్కను వీడిపోవుచుంటె ?
దీనులఁ గాపాడు దేవరా ! నీవె యీ
గతినుండ నన్నేరు గాంచువార

లలనాడు భక్తుల నందఱఁగాచిన
కరుణ నేడేమయ్యె కమలనేత్ర
దీనురాలను నీవె దిక్కటంచును నమ్మి
నన్ను గావగదే ప్రసన్నబుద్ధి

తే. గీ. నయ్య! నాయయ్య! చక్కనియయ్య! వేగ
రమ్మి, తావిమ్మి పాదపద్మమ్ములందుఁ
బరుగు పరుగున కరివరు మొరలు వినవె?
సురలు వెరఁగొంద నందఱు నరుదనంగ. 20

మత్తకోకిలము :—
కన్నులారగ నిన్నుగాంచెడు కాంక్ష యెన్ని దినాలనో
యున్నదీ మనమందు నేటికి యుష్మదీయ పదాబ్జముల్
కన్నదోయికి విందొనర్చెను గాంచఁజాల మరొక్కటిన్
అన్న నన్విడనాడ మంచిదటన్న రాఘవ! పాహిమాం. 21

మత్తకోకిలము :—
యెన్ని జన్మము లెత్తియుంటి నికెన్ని యెత్తగనుంటినో
యెన్నిమారులు భ్రాంతిలోఁబడి యేగతిన్ గనకుంటి, నీ
కన్న వేరెవరైన నుండిరె గాచువారలు భక్తులన్
ఎన్నజాల భవద్గుణాళి రమేశ! రాఘవ! పాహిమాం. 22

మత్తకోకిలము :—
మోహనక్రము కాలుబట్టుక ముంప సంసరణాబ్ధిలో
సాహసంబునఁ బోరుచుండియు చాలలేక నరుండు, దా

నూహఁజేసి మనంబునందున నొంద నీ పదభక్తి, యా
గ్రాహరాజము దున్మి భక్తునిగాచు రాఘవ! పాహిమాం.

తే. గీ. దీనజన బంధుఁడవు నీవు దీననేను
పతితజన పావనుండవు పతిత నేను
పాపులను బ్రోచుచుండెడి ప్రభుడవీవు
పాపపంక నిమగ్ను నేఁ బాపమతిని. 24

క. హరీ, మందరగిరి వర
ధారీ, యసురేశ మదవిదారీ, సీతా
నారీ హృద్వనజాత వి
హారీ, సంసరణ తాపహారీ, శౌరీ. 25

క. కాపాడుము నన్నిప్పుడు
నీపాలను బడితినయ్య నీరజనేత్రా!
కోపమదేలను దేవా
పాపములన్ బారద్రోలు ప్రభుడవుగావా. 26

గీతమాలిక :—

ఎన్ని యోనుల జన్మించుచున్నఁగాని
యెన్ని కష్టంబులన్ బడియున్నఁగాని
యెన్ని పను లందు మునుఁగుచునున్నఁగాని
నిన్ను నెప్పుడు నామది యెన్ను, వరము
క్రన్ననన్ నాకు నీయగదన్న నేడు. 27

ఆ. వె. నిన్నుసన్నుతించు పిన్నవానిని మున్ను
కన్నతండ్రికన్న మిన్నవై, ప్ర
సన్నమతినిగన్న వెన్నుడా! క్రన్నన
నన్నుగావకున్న మిన్నకిపుడు. 28

క. పట్టెద నీపాదంబులు
గట్టెద నామనములోన గట్టిగనెపుడున్
నెట్టెద నాపాపంబుల
నట్టడవికి భవభయంబు నాశనమొందన్. 29

క. రామా! ఘననీరద వ
త్శ్యామా! రఘురామ! భక్తసన్నుతధామా!
నీమాయఁ దెలియవశమా
కామారిస్తుత్యనామ! ఘనతరధామా! 30

ఆ. వె. నల్లవాడ! నాదు నుల్లంబులోనికి
మెల్లగానువచ్చి యెల్లకాల
ముల్లసిల్లుమయ్య, కల్లగాదిది వేగఁ
జల్లనైనకృపను జల్లుమయ్య. 31

ఉ. పున్నమచంద్రబింబమునుబోలెడునీ నగుమోముఁజూచి, నా
పున్నెముపండెనంటి నిటుపోవుటధర్మమె! పాడులోక మం
దున్నఫలంబదేమి? భవదుజ్జ్వలపాదయు గారవిందముల్
కన్నులపండువై తనరఁ గాంచెదము క్తినిధానమిప్పుడే. 32

ఉ. సారసపత్రనేత్ర! నినుజాలగనమ్మిన భక్తకోటి పెం
పారెడుసత్కృపన్ గనుచుదుమంచు మహాత్ములుసెప్పవింటి, నీ
చారుముఖాంబుజంబుఁగని శాంతినిబొందితి, నిన్ను వీడి, యీ
ధారుణి నుండజాల, ననుధన్యునుజేయవె? జానకీపతీ! 33

తే. గీ. వచ్చుచున్నాను దేవరా! వచ్చుచుంటి
నీదువెంటనె, నిన్వీడి నిముసమైనఁ
బ్రతుకఁజాలను రాఘవా! బ్రతుకఁజాల
నన్ను నీలోనఁ జేర్చుకో నల్లనయ్య! 34

వ. అని దీనాలాపంబు లాడుచుండ శ్రీరాముండు మరల శబరికడ కేతెంచె, నప్పుడు

తే. గీ. అనుచు వచియించి యాయమ్మ ఘనుఁడు రామ
భద్రు చరణాంబుజంబులే భక్తితోడఁ
జూచుచుండెఁ దదన్యంబుఁ జూడకుండ
వేరుచింతలు మనమున విడిచి యపుడు. 35

తే. గీ. ఎంత చిత్రము! రామభూకాంతుఁ గనుచు
సాలభంజిక విధమున సంచలనము
లేక యుండిన యామెదౌ రీతిఁగాంచి
చూచుచుండిరి సర్వులు చోద్యముగను. 36

ఆ. వె. అట్లు రామచంద్రు నవలోకనము సేయు
చుండ నొక్కవెలుగు చోద్యముగను
శబరి తనువునుండి సామిదేహముఁజొచ్చె
నచటివారు చిత్రమనుచుఁ బలుక. 37

తే. గీ. చూచుచుండిన కన్నులు చూచుచున్న
యట్టులేయుండె, మోడ్చిన హస్తయుగము
మోడ్చియేయుండె, యేమందు, మోమునందు
వెలయు తేజము నట్టులే వెలయుచుండె. 38

వ. పరమపావనురాలైన యా శబరి పరబ్రహ్మైక్యము జెందిన, యా దృశ్యము నవలోకించి మునిశ్రేష్ఠులందఱును శ్రీరామచంద్రు నిట్లని స్తుతియింపసాగిరి.

ఆ. వె. మునులమనుచు చాలఘనతకెక్కిన వార
మనుచు గర్వవార్ధి మునుగుచున్న
మమ్ము నుద్ధరించి మనిచిన దేవ! నీ
పాదపద్మములను బట్టనిమ్ము. 39

తే. గీ. అగ్రకులమందు జన్మించినందువలన
తక్కువారలఁబ్రోచుట ధర్మమనెడు
వాక్యరత్నమ్ము నెఱిగి యాపథము వెంటఁ
బయన మొనరించునట్లు కాపాడుమయ్య.! 40

ఉ. మాయవివేకమన్ తమముమాయఁగఁజేసిన జ్ఞానభాస్కరా!
పాయఁగఁజేయుమయ్య, భవపాశములన్నియు,నీమనంబులో
న్యాయము నెంచుమయ్య,యనయంబుభవత్పదకంజయుగ్మసే
సాయమొనర్చగా యికను చక్కఁగ మామనమందు
నుండుచున్. 41

మ. దురహంకారము క్రోడభక్తవరులన్ దూరంబుగాఁద్రోలుచున్
కరుణాదృష్టిని దీనహీనజనులన్ గాపాడుటల్ మాని, నీ
చరణాబ్జంబులచెంత జేరగలమేస్వామీ! దయాంభోనిధీ!
కరిరాజావన! దీనపాలన! జగత్కల్యాణ సంధాయకా 42

ఉ. ఎన్నఁడొ యార్తులందఱను నేలితివంచుఁ, గృపాబ్ధివంచుఁ దా
మెన్నివిధాలనో పలుకునెప్పుడు గూడను వేదశాస్త్రముల్
అన్నదులెల్ల నేడునిజమయ్యెడు నీ యఁనఘాత్ముఁరాలి, వే
మన్ననఁజేసి ప్రోచుటను మాధవ! దీనజనార్తిభంజనా! 43

ఉ. శ్రీకర! దేవతానికరసేవిత! చిన్మయ! కీర్తిసాంద్ర! సు
శ్లోక! పురాణపూరుష! సుశోభితకాంచనచేల! శౌరి! వ్యా
ణ్యాకర! ధర్మమార్గచర! నారదసన్నుత! భక్తవందితా!
నీకినె జోతలయ్య, రజనీచర ఖండన! లోకమండనా! 44

ఉ. తప్పులుజేసినారు, మరి ధర్మపథంబును వీడినారు, వీ
రెప్పుడు వీరిగావ తగవేయని నీమనమందు నెంచకో
యప్ప! దయాపయోధివని యందురుగాదె జనంబులెల్ల, నీ
గొప్పతనంబుఁ జూపుమిఁక కోమలదేహ! ధరాత్మజావరా!

క. శ్రీదంబులు జనపాప
చ్ఛేదంబులు, భక్తలోకచింతిత ధర్మో
త్పాదంబులు, బుధగణనుత
నాదంబులు రామ! నీదు నళినపదంబుల్. 46

ఉ. నిన్నుహృదబ్జమందుగను నేరుపులేదని జాలినొంది, మా
కన్నులపండువై యెదుటగన్పడి సాగితివయ్య, యింక మా
కన్న యదృష్టవంతులిల గానగరారుగదయ్య! యేడ, నే
పున్నెపు సత్ఫలంబొ! నినుపూజ లొనర్పగగంటి మీశ్వరా!

తే. గీ. శరణు శరణయ్య రాఘవా! శరణు శరణు
శరణు శరణయ్య శ్రీరామ! శరణు శరణు
శరణు శరణయ్య మాధవా! శరణు శరణు
శరణు శరణయ్య శ్రీహరీ! శరణు శరణు. 48

## పరబ్రహ్మైక్యము

### దండకము

శ్రీరామ! రామా! సురారాతిభీమా! లసద్దివ్యనామా! జగజ్జాల లీలావినోదా! మమున్ గావరాదా! కృపావృష్టివర్షించి సర్వంబు రక్షింప నూహించి, వైకుంఠ సౌఖ్యంబులన్వీడి, శ్రీరామ నామంబు జెల్వార ధాత్రీస్థలిన్ బుట్టి, గాధేయు యాగంబుఁ గాపాడి, పెన్కానఁ బాషాణ రూపంబుతో నున్న యామౌని పత్నిన్, భవత్పాద పంకేరుహ స్పర్శ ధన్యాత్మ గావించి, శ్రీకంఠు విల్లున్ని వైదేహి కేల్పట్టి, యాజామదగ్నిన్ పరాభూతు గావించి, పిత్రాజ్ఞచే కాన కేతెంచి, మమ్మున్ దయాదృష్టి వీక్షించు సామీ! భవద్దాసదాసానుదాసుల్ల మమ్మేలుమయ్యా! దోసంగుల్ క్షమించంగదయ్యా, యికన్ మాకు దిక్కెవ్వరున్ లేరు నీకన్న నోనల్లనయ్యా! ప్రణామంబు లన్ జేతుమయ్యా నమస్తే, నమస్తే, నమస్తే, నమః.

ఉ. మంగళమయ్యమాధవ! యుమాధవసాయక! లోకనాయకా!
మంగళమయ్య దానవ సమాజ వినాశన! పాపభంజనా!
మంగళమయ్య మౌనివర మానిత దివ్యతరప్రభావ! స
న్మంగళమయ్య భక్తజన మంగళదాయక! రంగనాయకా!

# త ప్పొ ప్పు ల ప ట్టి క

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 2 | సర౦ము బ్రహ్మమటంచు | సర్వము బ్రహ్మమటంచు |
| 3 | కన్నబిడ్డలకెపు | కన్నబిడ్డలకెప్డ |
| 4 | నీరేజనళనిభ | నీరేజదళనిభ |
| 19 | మెఱపున్ | మెఱపును |
| 21 | వృథయెగాదె | వృథయద్రాదె |
| 24 | బోధలనన్ని | భోధలెన్నైన |
| 25 | నిక్కమయోగ్యమను | నిక్కమయోగ్యను |
| 26 | అక్కడున్న | అక్కడనున్న |
| ,, | రాత్రియంత | రాత్రియెల్ల |
| 27 | నీవల్ల | నీతోడ |
| 29 | తనసన్నిధికిన్ యెప్పగిదినేని | తనసన్నిధికి న్నెప్పగిదినేని |
| 31 | పొందితేను | పొందినాను |
| 33 | కోర్కెల | కోర్కుల |
| 35 | అబ్దంబులాడి | అబద్ధంబులాడి |
| 37 | యేమిటో | యేమియో |
| 40 | దుఃఖతమసంబు | దుఃఖతిమిరంబు |
| 41 | ఆపురంబులో | ఆమునిపల్లెలో |
| 42 | నింటిలోన | నిలయమందు |

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 43 | కానీలేఘనుడాతడంచు మదిలో<br>కాంక్షమియున్ కొంచెమేన్<br>లేనేలేదని చెప్పుకొన్న తనకున్<br>లేదే సదాచార, మింకీ నీతుల్ | కానీలేఘనుడాతడంచు వినుమో<br>కాంతా! మదిన్నమ్మనన్<br>యానీచాత్మకు నాశ్రయంబిడుట<br>నష్టంబంచు భావించెనే |
| ,, | ఆపల్లెలోనున్న | ఆతపోవాటికలోనున్న |
| 45 | నీతివాక్యముల | నీతివాక్యమ్ముల |
| 46 | మదీయప్రార్థనన్ | మదీయవాక్యముల్ |
| 47 | మనసుఖంబున | మనసుఖంబును |
| ,, | జేసుకొనినగూడ | జేసికొనినగూడ |
| 49 | ప్రేమనొసంగు | ప్రేమనెసంగు |
| 50 | యేరనుచు | లేరనుచు |
| 51 | బరమపావనియైన | నిర్మలస్వాంత యా |
| ,, | యాపడతిమిన్న | మహనీయచరిత్ర |
| 62 | దనసతివెంటరాగ | దనవెనువెంటరాగ |
| 65 | శాలస్త్రివారలు | శాస్త్రిలవారలు |
| 68 | దప్పొటి | దప్పులు |
| 69 | కడుంబాపనర్దింపుడీ | కీడుంబాపనర్థింపుడీ |
| 70 | దారినెల్లపుడటంచు | దారినెల్లపుడంచు |
| 73 | యభిమానమిపు | యఃభిమానమిప్డు |
| 77 | డాంబికవృత్తిని | డాంబికవృత్తిని |
| 80 | పండ్లలెల్ల | పండ్లవెల్ల |

